శ్రీః

# శ్రీరాజోపచారపూజాకల్పము

(శాస్త్రుల విశ్వనాథశర్మ)

వ్యాఖ్యాత - డా॥ తాడేపల్లి పతంజలి



ప్రకాశకులు

శ్రీమతి రావి కృష్ణకుమారి–మోహనరావు దంపతులు

404, జంజనం కాంప్లెక్స్, చీరాల - 523 155.

**శ్రీః**

# శ్రీరాజోపచారపూజాకల్పము

**(శాస్త్రుల విశ్వనాథ శర్మ)**

**వ్యాఖ్యాత – డా॥ తాడేపల్లి పతంజలి**

ప్రతులు : 500
ప్రథమ ముద్రణ : 20.06.2019
పుటలు : 80
వెల రూ. : 30/–


404, Janjanam Complex,
Opp. I-Town Police Station,
**CHIRALA** - 523 157. **Cell : 94401 15411**

ప్రతులకు :

**డా॥ తాడేపల్లి పతంజలి**
Flat No.201, Sai Keerthi Residency,
Sathya Enclave, Chanda Nagar,
HYDERABAD - 500 050.
Cell : 77805 41502

D.T.P.:
**P. PARVATHI**
Cell : 7416586775.

Printed at :
**KARSHAK ART PRINTERS**
Hyderabad.

# శ్రీః

# శ్రీరాజోపచారపూజాకల్పము

శాస్త్రుల విశ్వనాథ శర్మ

(1 ఋగ్వేదః)

నిశ్వాసత్వాత్తవ పరమ! (జనని) యస్సచ్చిదానందసింధోః
శ్రీమాన్నిత్యో భ్రమవిరహితోఽపౌరుషేయః పురాణః ।
ఋగ్భిశ్శంసా ప్రవణ ఋషిసంవేద్య తత్త్వాభిరుద్య-
న్నాద్యామ్నాయో భజతి విధివద్బ్రహ్మణా ప్రేరితస్త్వామ్ ॥

(2 యజుర్వేదః)

ఆమ్నాయజ్ఞైర్ ఋషిభిరథ యచ్చోదనాలక్షణత్వా-
ద్ధర్మస్సర్వోఽధ్వర ఇతి నుతః ప్రాణ్యనుగ్రాహకస్సన్ ।
వేదస్సోఽయం భజతి పరమో యాజుషస్త్వాం యజుర్భి-
ర్యజ్ఞాత్మత్వం తవ విశదయన్ యజ్వనాం కర్మదర్శీ ॥

(3 సామవేదః)

తత్తన్మంత్రాత్మకవివిధసద్దైవతోపాధినిష్ఠాన్
శస్త్రైః స్తోత్రైః ప్రఉగకముఖై స్త్వద్గుణానాజ్యముఖ్యైః ।
గాయన్నుచ్చైర్భజతి నిగమస్సోఽద్య సామాభిధస్త్వాం
వేదానామస్మ్యహమితి పురా యం హి గీతాస్వవాదీః ॥

(4 అథర్వవేదః)

ఆగ్నేయాది ప్రకృతి మహితానస్త్రయోగాన్ బహూన్య-
స్తాంస్తాం ధత్తేఽభ్యధికమనుసంధానసంహారయుక్తాన్ ।
యేన క్షుద్రక్షపణపటవోఽంతర్బహిర్యాగయోగా-
స్సంవేద్యంతే భజతి పరిశిష్టోఽయమాథర్వణస్త్వామ్ ॥

(5 శీక్షా)

వర్ణాన్మాత్రాః స్వరాన్ యా స్ఫుటయతి బహుధా వైదికాంస్తాం త్రికాంశ్చ
ప్రోక్తా చారణ్యకేషు ప్రవిలసతి పరా తైత్తిరీయేషు యా వై ।
శీక్షా సేయం శ్రుతీనాం పదఫణితి విధాం సంహితా నిర్దిశంతీ
త్వామారాధ్యాఽద్యధన్యా భవితుముపగతా ప్రాతిశాఖ్యేన యుక్తా ॥

(6 వ్యాకరణం)

యచ్ఛబ్దానుగమాదృతే న భవతి జ్ఞానం కిమప్యన్యతః
కృత్స్నం వ్యాకరణం మహాత్మన ఇతశ్శాబ్దస్య హి బ్రహ్మణః ।
త్వడ్ఢక్కా నవపంచవారనినదాత్సమ్యక్సముద్భావితం
త్వామేవ ప్రతిపద్యతేఽఙ్గమధునా పాణిన్యుపజ్ఞం శ్రుతేః ॥

(7 ఛందః)

యత్తద్బ్రాహ్మణభాగవర్ణితమితశ్శాంఖ్యాయనాద్యైః పురా
భాగైశ్చ ప్రతిపాదితం కతిపయైః శ్రౌతాది సూత్రాంతరే ।
లోకే పింగళముఖ్యలక్షణ పరిజ్ఞైశ్చాపి విస్తారితం
ఛందస్త్వాం పరిసేవతే హ్యభయదం (దాం) స్వచ్ఛందసంచారిణం(ణీం)॥

(8 నిరుక్తం)

మంత్రబ్రాహ్మణవర్తినామితరతః ప్రాసంగికానాం సతాం
శబ్దానాం చ నిరుక్తిమాకలయతే వ్యుత్పత్సు లోకో యతః ।
యాస్కాచార్యముఖైశ్చిరాదధిగతం యన్నామ లింగోదయం
త్వాం చాలింగమనామరూపమభినౌత్యఙ్గం నిరుక్తం శ్రుతేః ॥

(9 జ్యోతిషం)

శ్రౌతస్మార్తవిధిప్రయుక్తమఖిలం సత్కర్మజాతం యతో
నిర్దిష్టే హ్యధికారిణాం సుమనసాం కాలే ప్రవర్తేత యత్ ।
కల్యాణప్రచురం సమస్తశుభదం స్కన్ధత్రయోజ్జృంభితం
జ్యోతిశ్శాస్త్రమథో భజత్యతితమాం త్వాం జ్యోతిషాముద్భవమ్ ॥

(10 కల్పః)

తత్తచ్ఛాఖీయధర్మాన్ శ్రుతిసమధిగతాన్ శ్రౌతగృహ్యాదిభేదాన్
శిష్టాచారక్రమేణ స్ఫుటమభివిదధత్కల్పసామాన్యసంజ్ఞమ్ ।

సూత్రం హ్యంగైస్త్రిభిస్త్స్యైః ప్రతిపదగహనైరుజ్జ్వలైః కర్మముఖ్యైః
కర్మ బ్రహ్మాత్మమూర్తిం కలయతి భవతో దేవ!(భవతీం దేవి!) నైష్కర్మసిద్ధ్యై॥

(11 పూర్వమీమాంసా)

న్యాయానాం చ సహస్రముత్తమమథో బిభ్రద్యదుజ్జృంభతే
యద్వై ద్వాదశలక్షణాత్మకమిదం జైమిన్యుపజ్ఞం మహత్ ।
యత్ర్పాభాకరభాట్టనామకశుభప్రస్థానయుగ్మాంచితమ్
తత్త్వాం వాక్యవిచారశాస్త్రమధునా పూర్వం భజత్యాదరాత్ ॥

(12 ఉత్తరమీమాంసా)

సత్యం జ్ఞానమనంతమాదికపదైస్తైస్తైః స్వరూపార్థదై-
ర్భేదాపోహచణైరతన్నిరసనైర్యా తత్త్వమస్యాదిభిః ।
ధీరాఽ విందత నేతి నేతి విధయా శ్రుత్యంతసీమంతినీ
యాసాక్షాద్భజతే, భవంతమధునా(ధునాంబ! భవతీం) సర్వాపరోక్షం(క్షాం)
శివం (వాం) ॥

(13 న్యాయః)

శాస్త్రార్థానిహ ధర్మధర్మికవిమర్శార్థోపపన్నాన్ విదు -
ర్యస్మాత్తత్ర్పవణం శ్రుతిప్రథితసన్మార్గప్రతిష్ఠాపకమ్ ।
శ్రీమన్మౌనికణాదగౌతమముఖాద్యాచార్యసంభావితం
శాస్త్రం తద్ధి విమర్శనేన భజతే త్వాం వై విమర్శోదయమ్ ॥

(14 ఆయుర్వేదః)

ఆద్యం సాధనమామనంత ఋషయో ధర్మస్య దేహం పురా
ప్రాహుస్తస్య హితాహితం తదుదితం దుఃఖం సుఖం ప్రాణినామ్ ।
ఆయుస్తస్య హితాహితం తదను తన్మానం చ యస్మిన్నసా-
వాయుర్వేద ఉపాస్త ఆదిపురుషం (జననీం) త్వాం వై విరాడాత్మకం (త్మికాం) ॥

(15 కావ్యమ్)

వ్యుత్పత్తిః ప్రభుసమ్మితాద్భవతి యా శబ్దప్రధానశ్రుతే-
ర్యాచార్థప్రవణాత్పురాణవచనాదిష్టా సుహృత్సమ్మితాత్ ।
తామేషా సుకుమారకోమలధియో వ్యుత్పాదయంతీ పరా,
కావ్యశ్రీర్భజతే రసాత్మకతయా త్వాం వ్యంగ్యమర్యాదయా ॥

(16 ఇతిహాసః)

స్త్రీశూద్రద్విజబంధవోఽనధికృతాస్సాంగేషు వేదేషు యే
యేఽల్పజ్ఞాశ్చ విశిష్య తాన్ప్రతిసముద్భూతః పురా బ్రహ్మణః ।
శ్రీమద్వ్యాసపరాశరాదిమునిభిః పశ్చాత్సుసంపాదితః
సోఽయం భో! ప్రతిపద్యతే ప్రతిపదం త్వాం చేతిహాసో మహాన్ ॥

(17 పురాణం)

యత్సర్గాది విశిష్టలక్షణపురాణానీకనిర్మాణత-
స్సంవ్యాస్యచ్ఛ్రుతి తచ్ఛిరాంసి, హి భవాన్(భవతీ)సచ్ఛాస్త్రయోనిస్స్వయమ్।
తద్వై భాగవతాంతముజ్జ్వలమిదం బ్రాహ్మాదికం విస్తృతం
త్వామేవాద్య మహావిభూతిసహితం (తాం) సమ్యగ్ధియా సేవతే ॥

(18 సంగీతం)

యస్య స్ఫూర్తిలవాయ నాగమృగగోబాలాస్తథా యోగిన-
స్సర్వే నాదతనోస్తవైవ హృదయే నిత్యం సముత్కంఠితాః ।
తద్వై తుంబురునారదాదిమునిభిస్సామ్నస్సముద్భావితం
త్వాం సంగీతమథో భజత్యతితమాం సప్తస్వరశ్రీయుతమ్ ॥

(19 నాట్యం)

బృందారణ్యచిదంబరాదిషు లసద్రాసాది గోష్ఠిస్స్వయం
బిభ్రత్త్వం నటరాడ్వపుర్హరిహరశ్రీకం యదర్థం సదా ।
పూజ్యైశ్శ్రీభరతాదిభిః ప్రవవృతే శాస్త్రం చ యస్మాదిదం
నాట్యం త్వాభిరుచేర్జనస్య బహుధాఽప్యేకం తదా సేవతే ॥

(20 సువాద్యం)

ప్రహ్లాదస్తాలవాద్యం తరలగతితయా చోద్ధవః కాంస్యవాద్యం
వీణావాద్యం సురర్షిః స్వరకుశలతయా పాండుపుత్రః శ్రుతిం వై ।
దేవాధ్యక్షో మృదంగం తదను వివిధవాద్యాంతరాణ్యన్యదేవా-
స్త్వామానందైకసాంద్రం సుఖయితుమభితో వాదయంతీష్టగోష్ఠ్యామ్ ॥

(21 ఆశుకవితా)

యా నామ ప్రతిభైకకారణకలా నానావిధైర్వర్ణనై-
స్సాలంకారగుణై రసోజ్జ్వలసమస్యాపూరణైశ్శోభితా ।

వైచిత్ర్యం పరితోగతా శతసహస్రాష్టావధానాదిభిః
సా చేయం సుకవీశ్వరాశుకవితా త్వాం సర్వదా విందతే ॥

(22 చూర్ణికా)

ఓతప్రోతసమాససంధిమధురా నృత్యత్పదప్రోజ్జ్వలా
సాలంకారగుణా చమత్కృతికరీ విద్వన్మనోరంజనీ ।
వ్యంగ్యార్థాహితచూతవద్రసపరీ పాకా హ్యనేకార్థదా
శ్రీమద్భాగవతాదిగా భజతి భో! త్వాం శోభనా చూర్ణికా ॥

(23 పంచాంగం)

శ్రీకల్యాణకరీ తిథిస్తనుభృతామాయుష్కరో వాసరః
నక్షత్రం ఘనతాపపాపశమనం యోగస్తు రోగాపహః ।
వాంఛా సిద్ధివిధాయకం హి కరణం వర్జ్యం శుభం వర్జితం
యస్మాత్త్యాజ్యయుతం భవంతమధునా(విశిష్టమద్య భవతీం)పంచాంగమాసేవతే॥

(24 వేదగోష్ఠి)

స్వరవర్ణక్రమసంయుతైర్బహువిధైః స్వప్రాతిశాఖ్యోదితైః
పదపాఠైః ప్రతిసంస్కృతైః క్రమజటా పాఠైర్ఘనాంతైస్తథా ।
వరణీయైర్లలితైః క్రమైరిహ చతుర్వేదాస్సమేతా అమీ
వృణుతే త్వాం పరితశ్చతుర్ముఖముఖాద్యేత్య ప్రపంచోద్గతాః ॥

(25 ఉత్తరనీరాజనం)

దివ్యైర్గోఘృతపూరపూరితలసత్కర్పూరఖండోజ్జ్వలై-
ర్మాణిక్యాంచితవర్తికాశ్రితమహాదీపైర్విచిత్రప్రభైః ।
అంతర్యామి తయా తమశ్చయహరం(రాం) జ్యోతిర్మయం(యీం)త్వాం పరం(రాం)
సమ్యగ్భాసయతే త్వదీయకృపయా నీరాజనఞ్చోత్తరమ్ ॥

- 0 -

# శ్రీః

# శ్రీరాజోపచారపూజాకల్పము

## శాస్త్రుల విశ్వనాథశర్మ

**శ్లో॥ విమలపటీ కమలకుటీ పుస్తక-రుద్రాక్ష-శస్త-హస్త-పుటీ ।**
**కామాక్షి! పక్ష్మలాక్షి కలితవిపంచీ త్వమేవ వైరించీ ॥**

**- మూకపంచశతి-ఆర్యాశతకము - 92వ శ్లో॥**

**తా ॥** స్వచ్ఛమైన వస్త్రమును ధరించి, కమలమును సభాగృహముగా (ఆసనముగా) చేసుకొని రెండు శక్తులు కలిగిన కామాక్షివి నువ్వు. వెడల్పయిన రెప్ప వెంట్రుకలున్న కన్నులు కలదానివి. చేతులలో పుస్తకము, రుద్రాక్షమాలను ధరించి స్తుతింపబడిన చేతులను పూలబుట్ట కలదానివి. కచ్ఛపి అను పేరుగల వీణను ధరించిన దానివి. బ్రహ్మ దేవుని ఇల్లాలివి నువ్వే తల్లీ! నీకు నమస్కారము. (అమ్మకు కుడివైపున సరస్వతీ దేవి, ఎడమవైపున లక్ష్మీదేవి ఉండి చామరములు (వింజామరలు) వీస్తుంటారు. కనుక అమ్మకు కుడివైపుగా నమస్కరిస్తే సరస్వతీ మాత వీచే చామరం గాలి వస్తుందట. (సరస్వతీ కటాక్షం), కొంచెం ఎడమవైపుకు నమస్కరిస్తే లక్ష్మీ కటాక్షం) మనమీద ప్రసరిస్తాయి. అలాకాకుండా అమ్మ రెండు పాదాలకు తల వంచి నమస్కరిస్తే చాలు లక్ష్మీ సరస్వతులేకాక అమ్మ సంపూర్ణమైన దయ వస్తుంది.)

***

శ్రీ శృంగేరీ శారదా పీఠాధీశ్వరులైన శ్రీశ్రీశ్రీ అభినవ విద్యారణ్య మహాస్వామి వారు, మరియు శ్రీశ్రీశ్రీ భారతీతీర్థ మహాస్వామి వారు మహాపండితులు శ్రీ శాస్త్రుల విశ్వనాథశర్మ గారి ఇంట్లో 3 రోజుల పాటు విడిది చేసినారంటే, ఆ మహనీయుడి గొప్పతనాన్ని వేరుగా చెప్పనవసరం లేదు. శృంగేరి శారదాపీఠ ఆస్థాన పండితుడు శ్రీ శాస్త్రుల విశ్వనాథ శర్మగారు.

వీరి గురించి భాగవతుల రామా గారు తెలంగాణా మాసపత్రికలో (మే 2016) ఇలా వ్రాసారు.

విభిన్న రంగాలలో సమర్థుడుగా ఓ వెలుగు వెలిగిన మహోన్నత వ్యక్తి శాస్త్రుల విశ్వనాథ

శర్మ. ఆయన సాహిత్య, వేదాంత, మీమాంస, వ్యాకరణ శాస్త్రాలతోపాటు, ఆయుర్వేదం, కవిత్వం, అష్టావధానం మొదలైన అనేక విషయాలలో లబ్ధప్రతిష్ఠుడు. ఆంధ్రదేశాన పురోహిత బ్రాహ్మణ వేదవిద్యా పరిషత్, తదితర సంస్థలను స్థాపించి ప్రఖ్యాతిగాంచారు.

విశ్వనాథ శర్మ మెదక్ జిల్లా శివంపేట గ్రామంలో 1926లో జన్మించారు. అన్నపూర్ణమ్మ, గుండయ్య శాస్త్రి వీరి తల్లిదండ్రులు. విశ్వనాథ శర్మ మూడవయేటనే తండ్రి మరణించడంతో మేనమామ, మేనబావల సంరక్షణలో పెరిగారు. ప్రాథమిక వేదవిద్య, స్మార్తజ్యోతిషాలు ఇంటిలోనే అద్దంకి తిరుమలాచార్యుల వద్ద నేర్చుకున్నారు. ఆ తరువాత అన్నగారైన అనంతరామ శర్మతోబాటు మున్నాలాల్ కళాశాలలో చేరి ప్రవేశపరీక్షలో ఉత్తీర్ణుడయ్యారు.

ఆనాటి తెలంగాణలోని బ్రాహ్మణులు కొంత వేదం, స్మార్తం, జ్యోతిషం నేర్చుకొని పౌరోహిత్యం, భూములు వుంటే వ్యవసాయం చేసేవారు. విశ్వనాథ శర్మకి చిన్నతనంలోనే వేదాధ్యయనం, శాస్త్రాధ్యయనం చేయాలనే సంకల్పం, పట్టుదల కలిగాయి. అందుకు ఆనాటి మద్రాసులోని మైలాపూర్ సంస్కృత కళాశాలలో చేరాలని భావించారు. కానీ, అక్కడ నిజాం రాష్ట్రం వారికి ప్రవేశం వుండేది కాదు. తెలిసిన పెద్దల సలహాతో సికింద్రాబాద్ వాసిగా (అప్పుడు సికింద్రాబాద్ – లష్కర్లపై ఆంగ్లేయుల ఆధిపత్యం వుండేది) చెప్పుకొని సాహిత్య శిరోమణి విభాగంలో చేరారు. వీలున్నప్పుడల్లా వేదాంత మీమాంస తరగతులలో కూర్చొని వాటిలోనూ ప్రావీణ్యం సంపాదించారు.

మద్రాస్‌లో వున్నప్పుడే పూజ్యశ్రీ హరహరానంద స్వామి (కరపాత్ర స్వామి) రావడం, వారి ప్రభావానికి లోనై వారివద్ద శ్రీమద్భాగవత, వాసుదేవాష్టాక్షరీ ఉపదేశాలను పొందారు. ఆ తర్వాత వారికి చాలా సన్నిహితులైన వారు చేపట్టిన ఎన్నో కార్యక్రమాలలో పాల్గొని, వారివద్ద శ్రీ విద్యాసంపూర్ణ పాదుకాంత దీక్షను కూడా పొందారు.

బ్రాహ్మణుల ఉద్ధరణకు కంకణం, సాహిత్య శిరోమణి పూర్తిచేసి వచ్చిన తరువాత వారికి అప్పటి తెలంగాణా పరిస్థితులు బాగా అవగాహనకు వచ్చాయి. దేశపాండ్యాలు, దేశ్‌ముఖ్‌లు, భూస్వాములు బ్రాహ్మణులను సేవకులుగా చూసేవారు. ఒకప్పుడు పాలకులను శాసిస్తూ, లోకకల్యాణాన్ని కొనసాగించిన బ్రాహ్మణులను ఈ దుస్థితి నుంచి ఉద్ధరించి, వారికి సమాజంలో తిరిగి సముచిత స్థానం కల్పించాలని విశ్వనాథ శర్మ కంకణం కట్టుకున్నారు. దానికి అనుగుణంగానే వేదవిద్యా పీఠాన్ని, పురోహిత బ్రాహ్మణ పరిషత్తును స్థాపించి పాఠశాలలను, శిక్షణా తరగతులను నిర్వహించారు.

పురోహితులపై సమాజంలో వున్న చిన్నచూపును తొలగించడానికి సభలు, సమావేశాలు, నిర్వహించారు. పౌరోహిత్య మీమాంస అనే గ్రంథాన్ని ప్రచురించి పురోహితులు, పౌరోహిత్యం

ప్రాశస్త్యాన్ని చాటిచెప్పారు. పురోహితులలో సక్రమమైన అధ్యయనం, శిక్షణ, సంప్రదాయ జ్ఞానం లేకపోవడం కూడా చిన్నచూపునకు కారణమని భావించి, పాఠశాలలు స్థాపించి పురోహితులకు తగిన శిక్షణ ఇచ్చే విధానాన్ని రూపొందించారు. 1972లో కొన్ని మాసాలు ఈశ్వరపురం ఇస్మాయిల్ ఖాన్ పేటలో, ఆ తరువాత మెదక్‌లో, శివంపేటలోని తమ ఇంట్లోనే పాఠశాలలను నిర్వహించారు. ముగ్గురు విద్యార్థులతో, ఇద్దరు ఉపాధ్యాయులతో ప్రారంభమై ఆరుగురు ఉపాధ్యాయులతో, వందమంది విద్యార్థులతో సుమారు రెండు దశాబ్దాలపాటు పాఠశాలను నిర్వహించారు. ఈ పాఠశాలలో వేదం, సంస్కృతం, స్మార్తంతో పాటు కొంత ఆంగ్లభాష కూడా బోధించేవారు. ఉస్మానియా విశ్వవిద్యాలయం గుర్తింపుతోబాటు దీనికి కేంద్రప్రభుత్వ ఆర్థిక సహాయం కూడా అందేది.

విశ్వనాథ శర్మ నిర్యాణం తరువాత వారి కుమారులు కూడా కొంతకాలం ఈ పాఠశాలను నిర్వహించారు. కానీ, విద్యార్థులు లేకపోవడంతో చివరకు మూసివేయవలసి వచ్చింది.

హిందీలో భూషన్ పరీక్ష, వ్యాకరణ అద్వైత శాస్త్రాలలో బి.ఓ.ఎల్ పట్టాలను సాధించారు. ఏ శాస్త్రంలోనైనా, ధర్మాచరణలోనైనా సందేహాలు వస్తే పండిత సభలను ఏర్పాటుచేసి చర్చించి, నిర్ణయాలు తీసుకునేవారు. చాలా అరుదుగా వచ్చే క్షయమాసం వారికాలంలో వచ్చినప్పుడు కొన్ని విభేదాలు, వివాదాలు తలెత్తాయి. అప్పుడు పండిత పరిషత్తును ఏర్పాటుచేసి కూలంకషంగా చర్చించి, సరైన నిర్ణయాలు తీసుకున్నారు. అలాగే, బాలశబ్దార్థ విచారము, వివాహంలో వధూవరుల దీక్ష, మూర్తిపూజ, తదితర అంశాలపై పండిత సభలు నిర్వహించారు.

కేంద్ర ప్రభుత్వ లాల్‌బహదూర్ శాస్త్రి విద్యాపీఠ ప్రణాళికలో భాగంగా ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర సంస్కృత శతాబ్ది గ్రంథాన్ని (1970) ఎంతో శ్రమకోర్చి ప్రచురించారు. ప్రతి రాష్ట్రంలోనూ సంస్కృతం, ప్రాచీన చరిత్రను సంగ్రహంగాను, ముందు వంద సంవత్సరాల లోని సంస్కృత వైభవాన్ని విపులంగాను సంకలనం చేయటం ఈ ప్రణాళిక ఉద్దేశం. విశ్వవిద్యాలయాలు, పరిశోధక సంస్థలు, కళాశాలలు, విద్యాసంస్థలు సంస్థానాలు, పండితులు, రచయితలు, కవులు, ముద్రిత, అముద్రిత గ్రంథాలు మొదలైనవి అన్నీ ఈ గ్రంథంలో చోటుచేసుకున్నాయి. ఈ కార్యభారాన్ని వహించడానికి ఎవ్వరూ ముందుకు రాకపోవడంతో ప్రణాళికా కార్యదర్శి ఆచార్య మండనమిశ్రుల ప్రోద్బలంతో ఈ భారాన్ని తానే వహించి 500 పేజీల గ్రంథాన్ని విశ్వనాథ శర్మ ప్రచురించారు. ఇది ఆంధ్రప్రదేశంలోని సంస్కృత సంపదకు ఆయన అందించిన మహోజ్జ్వల ఆభరణం.

శృంగేరి ఆస్థాన పండితునిగా... ఇన్ని కార్యక్రమాలు నిర్వహిస్తున్నప్పటికీ రచనా

వ్యాసంగాన్ని మాత్రం ఆయన విడనాడలేదు. శాస్త్రార్థ చర్చల్లోనూ భారతదేశంలోని అన్ని ప్రాంతాలలో పాల్గొనేవారు. వీరి అసమాన శేముషీ వైభవాన్ని, పాండిత్య ప్రకర్షను, ధర్మనిష్ఠను గమనించి శ్రీ శృంగేరి స్వామివారు తమ ఆస్థాన పండితునిగా గౌరవించారు. 1961లో అష్టగ్రహ కూటమి సందర్భంగా ఫీలుఖానాలో జరిగిన బ్రహ్మాండమైన యజ్ఞకార్యక్రమంలో విశ్వనాథశర్మను ఏనుగుపై ఊరేగించి సత్కరించారు. ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ఉత్తమ ఉపాధ్యాయ అవార్డు కూడా వీరిని వరించింది. మెదక్ మండల సాహిత్య పరిషత్ వారు వీరిని '**అభినవ విద్యారణ్య**' బిరుదుతో సత్కరించారు. శారదా బిల్లు, హిందూకోడ్ బిల్లులకు వ్యతిరేకంగా జరిగిన ఉద్యమాలలో కూడా ఎంతో చురుకుగా పాల్గొన్నారు.

విశ్వనాథ శర్మ అనేక కార్యక్రమాలలో తీరిక లేకుండా గడిపినప్పటికీ, అనేక గ్రంథాలను కూడా రచించారు. వీటిలో ముఖ్యమైనది నామసహస్రి. ఇది విష్ణుసహస్రనామాలకు శంకరభాష్యాన్ని అనుసరించి చేసిన పద్యానువాదం. ఇది ఇంకా ముద్రణకు నోచుకోలేదు. ఇవిగాక, రాజోపచారపూజ, న్యాయ మీమాంస, ఏడుపాయల దుర్గాభవానీ సుప్రభాతం, ఏడుపాయల దుర్గాభవాని మహాత్మ్యం, రఘువంశం మొదటి మూడు సర్గల పద్యానువాదం (ఆంధ్ర రఘువంశావతరణం), మాండూక్యోపనిషత్తు అనువాదం వీరి రచనలలో కొన్ని. విశ్వనాథశర్మ 1985 మే 5వ తేదీన పరమపదించారు.

ఇటువంటి మహనీయుడు సంస్కృతభాషలో రచించిన శ్రీరాజోపచార పూజాకల్పము అను చిరుపొత్తానికి ప్రతిపదార్థ తాత్పర్యాలు వ్రాయమని, పుస్తకంగా ప్రచురిద్దామని ఈ పరమ పవిత్రమైన తొలిఏకాదశి రోజున (23.7.2018) అనేక గ్రంథాలు ప్రచురించిన సహృదయులు "పుస్తక మోహన" శ్రీ రావిమోహనరావుగారు అడిగారు. నేను వైదిక "సంస్కృత భాష"కు నేను చాలను – అను సంశయంతోనే – అంగీకరించాను.

అన్నింటికి వీణాపాణి శారదాంబ ఉన్నదనే నమ్మకం ఈరోజే అనువాదానికి శ్రీకారం చుడుతున్నాను.

తలమీది జుట్టులో చేయి దూర్చి "ఏం ఫర్వాలేదు నాన్నా... నేనున్నాను కదా!" అని అమ్మలగన్న అమ్మ ఆప్యాయంతో పలికిన అనుభూతి తోడుగా ఈ పుస్తక అర్చన మొదలవుతోంది.

విద్వాంసులైన పెద్దలు నేను ఎక్కడన్నా రచనలో తడబడితే, సవరిస్తే నేను తక్కువగా భావించను. అమ్మవారి ముఖతః పలికినట్లుగా భావించి వినమ్రంగా సవరించుకొంటాను.

**– డా॥ తాడేపల్లి పతంజలి.**

పుస్తకం గురించి వేదశాస్త్రాధ్యవధారణాత్మక **"శ్రీ రాజోపచార పూజాకల్పము"** అని శ్రీ శాస్త్రుల విశ్వనాథ శర్మగారు పేరు పెట్టారు.

రాజుకు జరుగు శుశ్రూష లేక సేవ రాజోపచారము అంటారు. వేదాంగాలలో (శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పం). ఒకటి కల్పం. పూజయొక్క విధి విధానాలను తెలిపేదాన్ని కల్పం అంటారు.

ఈ పుస్తకంలో ఋగ్వేదం, యజుర్వేదం మొదలైన గ్రంథాలద్వారా శ్రీశర్మగారు భగవంతుని పూజ చేసారు.

అవధరింపుము, వినుము అనే హెచ్చరికను తెలిపేశబ్దం అవధారు, ప్రతి గ్రంథము యొక్క గొప్పతనాన్ని స్వామి వారికి అన్వయిస్తూ ఒక శ్లోకాన్ని వ్రాసి – ఓ స్వామీ! నేను ఇప్పుడు ఈ గ్రంథసేవ నీకు చేసాను. అవధారు (వినుము) అని ఆ శ్లోకం కింద రచయిత వ్రాసారు...

ఇలా మొత్తం 24 గ్రంథాల ద్వారా స్వామి సేవ. చివరలో ఉత్తర నీరాజనం. స్వామివారికి రకరకాల సేవలు చేయటం ఉన్నది కాని ఇలా గ్రంథాల ద్వారా స్వామి సేవ చేయటం ఒక వినూతనమైన ఆలోచన. శిరోమణి, భాషాప్రవీణ శ్రీ శాస్త్రుల విశ్వనాథ శర్మగారికి నమస్సులు అర్పిస్తూ వారి సేవా ప్రపంచంలోకి అడుగుబెడదాం.

***

# శ్రీః

# శ్రీరాజోపచారపూజాకల్పము

శాస్త్రుల విశ్వనాథశర్మ

## 1 ఋగ్వేదః

**అవతారిక :** ఈ శ్లోకంలో కవి ఋగ్వేదము ద్వారా ఆ పరమాత్మకు అక్షరసేవ చేస్తున్నారు.

నిశ్వాసత్వాత్తవ పరమ! (జనని) యస్సచ్చిదానందసింధోః
శ్రీమాన్నిత్యో భ్రమవిరహితోఽ పౌరుషేయః పురాణః ।
ఋగ్భిశ్శంసా ప్రవణ ఋషిసంవేద్య తత్త్వాభిరుద్య-
న్నాద్యామ్నాయో భజతి విధివద్బ్రహ్మణా ప్రేరితస్త్వామ్ ॥
హే దేవదేవోత్తమ! (మే) దేవతాసార్వభౌమ (మి)!
ఋతంభరప్రజ్ఞా సముల్లసిత ఋషిమండల శంసిత!
(తే) ఋతానృతాతీత స్వభావ! (వే) ఋగ్వేద
ప్రియతమ (మే) ఋగ్వేదసేవామవధారయ

**వ్యాఖ్య : 01. ఋగ్వేదము :**

**పదవిభాగం :** నిశ్వాసత్వాత్, తవ, పరమ జనని, యత్ సత్, చిత్, ఆనంద సింధోః, శ్రీమాన్ నిత్య, భ్రమ విరహితః, అపౌరుషేయః, పురాణః, ఋగ్భిః, శంసా ప్రవణ ఋషి సంవేద్య తత్త్వాభిః ఉద్యన్ ఆద్య ఆమ్నాయః భజతి విధివత్ బ్రహ్మణా ప్రేరితః త్వామ్.

**ప్రతిపదార్థం :** పరమ = శ్రేష్ఠుడా! (జనని = మాతా!), బ్రహ్మణా = దైవముచే; ప్రేరితః = ప్రేరేపింపబడి; సత్ = సత్యము; చిత్ = జ్ఞానము, ఆనంద = సంతోషము; సింధోః = సముద్రమయిన, శ్రీమాన్ = గౌరవనీయుడవైన; తవ = నీయొక్క, నిశ్వాసత్వాత్ = నిట్టూర్పులవలన, (వేదముల వలన), యత్ = ఏ; నిత్య భ్రమ = ఈ ప్రపంచము నిత్యమైనదను శాశ్వత భ్రమ; విరహితః = విడువబడినదో; ఋగ్భిః = 1. ఛందోబద్ధమగు వేదమంత్రములలో, (వ్యు.ఋచ = స్తుతౌ – ఋచ్+క్విప్. (కృ.ప్ర.) శంసా = మాట; స్తోత్రము; ఇచ్ఛ; ప్రవణ = వినమ్రులైన; ఋషి = జ్ఞానముచే సంసార పారమును చేరువాడు

(వ్యు. ఋషీ = గతౌ. ఋష+కి (కృ.ప్ర.) సంవేద్య = తెలిసికొనఁదగినది. 2. అనుభవింపఁ దగినది (అయినదో). అపౌరుషేయః = మనుష్యనిర్మితము కానిది; దైవనిర్మితమైనది; పురాణః = సర్గము, ప్రతిసర్గము అను లక్షణములు కల తత్త్వాభిః = తత్త్వములతో; ఉద్యత్ = 1. పైకి లేచుచున్న, 2. ఉదయించుచున్న 3. బయలుదేఱుచున్న, ఆద్య = ప్రథమము; మొదటిది, ఆమ్నాయః = మరల మరల చదువుటకలిగిన ఆ ఋగ్వేదమను ఆమ్నాయము (వ్యు.మ్నా = అభ్యాసే–ఆ+మ్నా+మఞ్. (కృ.ప్ర.), విధివత్ = శాస్త్రప్రకారంగా, త్వామ్ = నిన్ను (నీగురించి), భజతి = సేవించుచున్నది.

**తాత్పర్యము :** శ్రేష్ఠుడా! (ఓ పరమేశ్వరా!) జనని = మాతా! (ఓ పరమేశ్వరీ!) సత్యజ్ఞాన సంతోష సముద్రమయిన గౌరవనీయుడవైన, నీచే ప్రేరేపింపబడి నీయొక్క నిట్టూర్పులవలన ఋగ్వేదం పుట్టింది.

ఈ ప్రపంచము నిత్యమైనదను శాశ్వత భ్రమను విడిపించే ఛందోబద్ధమగు ఆ ఋగ్వేద మంత్రములతో నీయందు వినమ్రులైన ఋషులచే మాటలతో స్తోత్రములు చేయబడుచున్నవి.

ఆ ఋగ్వేదం తెలిసికొనదగినది. అనుభవింపదగినది. అది మనుష్యనిర్మితము కానిది; దైవనిర్మితమైనది; సర్గము, ప్రతిసర్గము అను లక్షణములు కల పురాణ తత్త్వములకుకల ఉత్తుంగ భావములతో వేదములలో మొదటిదయిన ఆ ఋగ్వేదం శాస్త్ర ప్రకారంగా నిన్ను సేవించుచున్నది.

ఓ దేవతలకు దేవతలయిన వారిలో ఉత్తముడా! దేవతా చక్రవర్తీ! సత్యమైన జ్ఞానం సహజంగా ఉన్న ఋషులచే పొగడబడినవాడా! సత్యము, అబద్ధములకు అతీతమైనవాడా! ఋగ్వేదమందు ప్రేమ కలిగినవాడా! నేను ఈ శ్లోకంతో చేసిన ఋగ్వేద సేవను స్వీకరించు.

(పూజనీయదేవత పరమేశ్వరి అయినచో కుండలీకృత భాగాలను చేర్చాలి. పరమేశ్వరు డయినచో ఆ భాగాలను వదిలి కల్పం చెప్పుకోవాలని రచయిత ప్రారంభంలో చెప్పారు. అందువలన పరమేశ్వరుడు పూజనీయదేవత అయినచో దేవదేవోత్తమ (దేవతలకు దేవతలయిన వారిలో ఉత్తముడా!) అని, పూజనీయ దేవత పరమేశ్వరి అయినచో దేవదేవోత్తమే (దేవతలకు దేవతలయిన వారిలో ఉత్తమురాలా!) అని సంబోధనలు మార్చుకోవాలి. ఈ పద్ధతిని మిగతా సంబోధనలలోనూ అనుసరించాలి.

**విశేషాలు : 1. నిశ్శ్వాసత్వాత్** : పరమశివుని నిట్టూర్పు వల్ల వేదాలు, శివుడు స్మరించడం వల్ల పురాణాలు జనించాయని కథ. అందువలన ఈ శ్లోకంలో ఇదే విషయాన్ని కవి పేర్కొన్నారు.

**2. సచ్చిదానందం** : సత్+చిత్+ఆనందం. సత్యం, జ్ఞానం, ఆనందం కలసి పరమాత్మ

స్వరూపం. భూత, భవిష్యత్, వర్తమానాల వల్ల మార్పు చెందనిదీ, ఎప్పుడూ ఒకే విధంగా ఉండేదీ సత్/సత్తు. సచ్చిదానందంలో రెండవదైన చిత్/చిత్తు అంటే ఎరుక. నిరుపాధికం, నిరతిశయం, నిరుపమానం అయి ఎప్పటికీ ఉండే సుఖానుభూతి ఆనందం. దీపానికి ఎరుపు తెలుపుల మిశ్రమ వర్ణం, వేడి, కాంతి ఎలా స్వాభావికంగా కలసి ఉంటాయో అలా సత్తు, చిత్తు, ఆనందం మిళితమై ఉంటాయి. అవి అభిన్నం.

**3. పురాణం** : సర్గము, ప్రతిసర్గము, వంశము, మన్వంతరము, వంశానుచరితము అను నైదు లక్షణములు గల గొప్ప గ్రంథము. (పురాణములు పదునెనిమిది. అవి – బ్రహ్మ, పద్మ, విష్ణు భాగవత నారదీయ మార్కండేయ యాగ్నేయ భవిష్యత్ బ్రహ్మవైవర్త లింగ వరాహ వాయు స్కాంద వామన కూర్మ మత్స్య గరుడ బ్రహ్మాండములు.)

**4. విధి** : చేయవలసిన పని. వేదం చెప్పిన పద్ధతి. త్రివిధమైన విధులు : 1. అపూర్వవిధి, 2. నియమవిధి, 3. పరిసంఖ్యావిధి.

**5. ఛందస్సు** : ఇది మందాక్రాంతము 17 అక్షరములు ఉండును. 27 మాత్రలు ఉండును. ప్రతి పాదములోను మ,భ,న,త,తగా (గగ) గణములుండును.

2 యజుర్వేదః

**అ :** ఈ శ్లోకంలో కవి యజుర్వేదము ద్వారా ఆ పరమాత్మకు అక్షరసేవ చేస్తున్నారు.

ఆమ్నాయజ్ఞైర్ ఋషిభిరథ యచ్చోదనాలక్షణత్వా-
ద్ధర్మస్సర్వోఽధ్వర ఇతి నుతః ప్రాణ్యనుగ్రాహకస్సన్ ।
వేదస్సోఽయం భజతి పరమో యాజుషస్త్వాం యజుర్భి-
ర్యజ్ఞాత్మత్వం తవ విశదయన్ యజ్వనాం కర్మదర్శీ ॥
హే దేవదేవోత్తమ! (మే) దేవతాసార్వభౌమ! (మి) యజ్ఞభూమి
సముద్ధరణాదృతయజ్ఞపురుషానుజన్మదీక్షాదీక్షిత!
(తే) యజ్వలోకసంగ్రహార్థానుష్ఠీయమానయజనాది
షట్కర్మకలాప(పే)! యజ్ఞస్వరూప(పే)! యజుర్వేద
ప్రియతమ(మే)! యజుర్వేద సేవామవధారయ ॥

**ప :** ఆమ్నాయజ్ఞైః, ఋషిభిః, అథ, యత్, చోదనాలక్షణత్వాత్,
ధర్మః, సర్వః, అధ్వర ఇతి నుతః ప్రాణి, అనుగ్రాహకః సన్
వేదః, సః, అయం భజతి పరమః యాజుషః, త్వాం యజుర్భిః
యజ్ఞాత్మత్వం, తవ, విశదయన్, యజ్వనాం, కర్మదర్శీ

**ప్ర :** అథ = పిమ్మట, ఆమ్నాయజ్ఞైః = మరల మరల చదువుట కలిగినది కనుక వేదమునకు ఆమ్నాయము అనిపేరు. ఆ వేదమును తెలుసుకొన్న (మ్నా అభ్యాసే); ఋషిభిః = జ్ఞానముచే సంసార పారమును చేరిన ఋషుల చేత (ఋషి గతౌ); యత్ = ఏ, సర్వః ధర్మః = సర్వమైన లక్షణములు కలిగిన ధర్మమును; చోదనాలక్షణత్వాత్ = ప్రేరేపించు లక్షణత్వము వలన; అధ్వరః = కుటిలము కానిది. ఉత్తమమైనది అగుటవలన యజ్ఞమునకు అధ్వరము అనిపేరు. (ధ్వృ–మూర్ఛనే కుటిలీ భవనే) అటువంటి యజ్ఞములలో, యజ్వనాం = విధ్యుక్తముగా యజ్ఞము చేసినవారి యొక్క(చే) చదువబడి; నుతః = పొగడబడిన; ప్రాణి = జీవుల; అనుగ్రాహకః = అనుగ్రహించునది, సన్ = అగుచు; అయం సః వేదః = ఈ ఆ యజుర్వేదము; పరమః = శ్రేష్ఠుడైన; యాజుషః = యజుర్వేదం సూచించిన ప్రకారం యజ్ఞాది కర్మకాండను నిర్వహించే వాడయిన; త్వాం = నిన్ను; యజుర్భిః = యజస్సులచేత; యజ్ఞాత్మత్వం = యజ్ఞాత్మత్వము కలిగిన; కర్మదర్శీ = కర్మలను దర్శించు; తవ = నీకు (నిన్ను), విశదయన్ = విశదీకరించుచూ; ఇతి భజతి = ఇట్లు సేవించుచున్నది.

**తా:** ఓ పరమపురుషా! యజుర్వేదము – సర్వమైన లక్షణములు కలిగిన ధర్మమును ప్రేరేపించు లక్షణములు కలిగిన యజ్ఞములలో, ఋషులచేత తెలుసుకొనబడి, విధ్యుక్తముగా యజ్ఞము చేసినవారిచే చదువబడుచున్నది.

ఆ యజుర్వేదం జీవులను అనుగ్రహించునది. శ్రేష్ఠుడు, యజ్ఞాత్మకుడు, కర్మదర్శి అయిన నిన్ను – యజ్ఞాది కర్మకాండను నిర్వహించే వారిచే, తన యజుస్సులచేత విశదీకరింపచేస్తూ యజుర్వేదం సేవించుచున్నది.

ఓ దేవతలకు దేవతలయిన వారిలో ఉత్తముడా! దేవతా చక్రవర్తీ! యజ్ఞ కార్యక్రమంలో మహావేది వున్న ప్రదేశాన్ని నాగలితో దున్ని దేవతల రాజైన ఇంద్రుడిని (అనుజన్ముడు) యాగానికి ఆహ్వానించే కార్యక్రమం జరుగుతుంది. యజ్ఞాది క్రియారంభమునందు ఆచార నియమము కలయజ్వలచే సోమముగల యజ్ఞమునందు దీక్ష వహింప చేయువాడా! విధ్యుక్తముగా యజ్ఞము చేసినవారిచే చక్కగా గ్రహింపుట కొరకు ఆచరింపచేయ బడిన 1. అధ్యాపనము, 2. అధ్యయనము, 3. యజనము, 4. యాజనము, 5. దానము, 6. ప్రతిగ్రహము అను ఆరు కర్మలు కలిగినవాడా! యజ్ఞస్వరూపుడా! యజుర్వేదమందు ప్రేమ కలిగినవాడా! నేను ఈ శ్లోకంతో చేసిన యజుర్వేద సేవను స్వీకరించు.

**వి:** అథ : ప్రస్థానత్రయంలో ఒకటైన బ్రహ్మసూత్రాలలో మొదటిది అథ శబ్దంతో ప్రారంభమవుతుంది. **(అథాతో బ్రహ్మ జిజ్ఞాసా)** ధర్మ శాస్త్ర గ్రంథాలు సైతం అథ

శబ్దంతో ప్రారంభం అవుతున్నాయి. (**అథాతో ధర్మ జిజ్ఞాసా**) శ్రీకారంతో ప్రారంభించడం శుభప్రదమని భావించడం తెలిసిన సంగతే. అథ శబ్దం కూడా అట్టిదేనని పండితుల భావన.

**లక్షణత్వాత్** : లక్షణము వలనను, ప్రమాణమువలనను వస్తుసిద్ధి కలుగును.

(**లక్షణ ప్రమాణాభ్యాం వస్తుసిద్ధిః**) అనఁగా – ఒకవస్తువును తెలిసికొనుటకు మొట్టమొదట దాని లక్షణములను, ఆ తరువాత ఆలక్షణములు ప్రత్యక్షములుగ ప్రమాణమును కావలసియుండును. అట్లే – పృథివిని "**గన్ధవతీ పృథివీ**" అని గంధవత్త్వలక్షణమును ఆగంధవత్త్వమును మనకు ప్రత్యక్షముగ ననుభవములో నుండుటను బట్టి మనము తెలిసికొనుచున్నాము. పరమేశ్వరుని భక్తులు సర్గాదిహేతుత్వరూపేశ్వరలక్షణము శ్రుతి ప్రమాణముల వలన తెలిసికొనుచున్నారు.

**ధర్మ లక్షణాలు:** ధర్మలక్షణాలుగా పదింటిని చెపుతారు. అవి : 1. ధృతి, 2. క్షమ, 3. దమం, 4. ఆస్తేయం, 5. శౌచం, 6. ఇంద్రియ నిగ్రహం, 7. ధీ, 8. విద్య, 9. సత్యం, 10. అక్రోధం.

**కర్మలు:** 1. అర్థకర్మ (దర్శపూర్ణ మాసాదికము), 2. గుణకర్మ (ఇడా భక్షణాదికము),

"**ఆత్మగతా పూర్వజననం కర్మ అర్థకర్మ గుణకర్మ సంస్కారజనకమ్**" (మీమాంసా–న్యాయప్రకాశము)

1. సంచితము, 2. క్రియమాణము, 3. ప్రారబ్ధము.

"**సంచితం వర్తమానం చ ప్రారబ్ధమితి భేదతః**" (దేవీభాగవతం 6–10–8)

1. పశురక్షణ, 2. దానము, 3. యజ్ఞము, 4. అధ్యయనము, 5. వాణిజ్యము, 6. కుసీదము.

"**పశూనాం రక్షణం దానమిజ్యాధ్యయమేవ చ, వణిక్పథం కుసీదం చ**" (మనుస్మృతి 1–90)

**యజుర్వేదం:** ఋక్ యజుస్సామ అథర్వణ వేదాలు నాలుగింటిలో రెండవది. ఋగ్వేదంలో మంత్రాలు ఋక్కులు. సామవేదంలో సామలు. ఇవి రెండూ కానివి యజుర్వేద మంత్రాలు. "**శేషే యజుః**" అని సూత్రం. ఇవి 109 వరకు ఉన్నాయంటారు. యజుర్వేద మంత్రాలు రెండు భాగాలు. ఒకటి శుక్ల యజుర్వేదం, రెండవది కృష్ణ యజుర్వేదం. శుక్ల యజుర్వేదానికి వాజసనేయ సంహిత అనే పేరు కూడా ఉంది. వాజసని అంటే సూర్యుడు. సూర్యుడి నుంచి యాజ్ఞవల్క్య ముని

గ్రహించినది గనుక వాజసనేయం అనే పేరు వచ్చింది. వేద విభజన చేసిన వ్యాసుడి నుంచి వైశంపాయనుడు యజుర్వేదం నేర్చుకొన్నాడు. వైశంపాయనుడి నుంచి యాజ్ఞవల్క్యుడు తెలుసుకొన్నాడు. కాని, వైశంపాయనుడికీ, యాజ్ఞవల్క్యుడికీ మధ్య ఏదో వివాదం రావడం వల్ల యాజ్ఞవల్క్యుడు తాను నేర్చిన వేదాన్ని వదలి వేయవలసి వచ్చింది. (మంత్రాలను కక్కవలసి వచ్చిందనీ, అలా కక్కిన మంత్రాలను దేవతలు తిత్తిరి పక్షుల రూపంలో వచ్చి తినివేశారనీ ఒక కథ ఉంది. కక్కిన మంత్రాలు నల్లగా ఉండటం వల్ల వాటి సంహితకు కృష్ణ యజుర్వేదం అనే పేరు వచ్చిందంటారు. ఏదో ఒక గూఢార్థంతో ఈ కథను ప్రచారంలోకి తెచ్చి ఉంటారు. యాజ్ఞవల్క్యుడు వదలు కొన్నప్పటికీ ఆయన నుంచి అప్పటికే తెలుసుకొని ఉన్న కొందరు శిష్యులు వాటిని భద్రపరచి ఉంటారు.) నేర్చుకొన్నది పోయినందుకు బాధబడిన యాజ్ఞవల్క్యుడు సూర్యుడిని ఉపాసించి తిరిగి యజుర్వేదాన్ని సంపాదించాడు. అదే శుక్ల యజుర్వేదం (శుక్ల అంటే తెలుపు. కృష్ణ అంటే నలుపు) యజుర్వేదం అలా రెండు శాఖలుగా వ్యాప్తిలోకి వచ్చింది. వైశంపాయనుడు నేర్పినది కృష్ణయజుర్వేదమని, సూర్యుడు చెప్పినది శుక్ల యజుర్వేదమని రెండు శాఖలు వాడుకలోకి వచ్చాయి. యజుర్వేదం అనే శబ్దం యజుస్, వేదం అనే రెండు పదాల కలయిక. యజుస్ శబ్దం యజ్ అనే ధాతువు నుంచి ఏర్పడింది. యజ్ఞం అనే శబ్దమూ యజ్ నుంచి వచ్చినదే. యజ్ అంటే ఆరాధించడం, పూజించడం లాంటి అర్థాలు ఉన్నాయి. కర్మకాండను తెలియజేసే మంత్రాలు యజుస్సులు. యజ్ఞాలు ఎలా జరగాలో ఈ మంత్రాల వల్ల తెలుస్తుంది. యజుర్వేద మంత్రాలు సాధారణంగా గద్యరూపంలోనే ఉంటాయి. (ఋుక్ పాదబద్ధా, గీతంతు సామ, గద్యం యజుర్మంత్రః) బ్రాహ్మణాలతో కలసిన యజుర్వేద మంత్రాలు యజుర్వేద సంహిత. శుక్ల యజుర్వేదంలో మాధ్యందిన సంహిత, కణ్వ సంహితలు ఉన్నాయి. కృష్ణ యజుర్వేదంలో సంహిత, బ్రాహ్మణ భాగాల విభజన కనిపించదు. స్పష్టత లేకపోవడమే కృష్ణ శబ్దం (చీకటి) పొందడానికి కారణమై ఉండవచ్చునని ఒక అభిప్రాయం. కృష్ణ యజుర్వేంలో తైత్తిరీయ, కఠ, మైత్రాయణీ శాఖలు ఉన్నాయి. (పారమార్థిక పదకోశం).

3 సామవేదః

**అ :** ఈ శ్లోకంలో కవి సామవేదము ద్వారా ఆ పరమాత్మకు అక్షరసేవ చేస్తున్నారు.

తత్తన్మంత్రాత్మకవివిధసద్దైవతోపాధినిష్ఠాన్
శస్త్రైః స్తోత్రైః ప్రఉగకముఖై స్త్వద్గుణానాజ్యముఖ్యైః ।

గాయన్నుచ్చైర్భజతి నిగమస్సోఽద్య సామాభిధస్త్వాం
వేదానామస్మ్యహమితి పురా యం హి గీతాస్వవాదీః ॥

హే దేవదేవోత్తమ! (మే) దేవతాసార్వభౌమ! (మి)
సర్వజ్ఞ సర్వశక్తే! సమస్త కల్యాణగుణ మహోదధే!
సచ్చిదానందస్వరూప(పే) సామవేద ప్రియతమ(మే)!
సామవేద సేవామవధారయ

**ప:** తత్ తత్ మంత్ర, ఆత్మక, వివిధ, సత్, దైవత,
ఉపాధినిష్టాన్, శస్త్రైఃస్తోత్రైః, ప్ర ఉగక, ముఖ్యైః, త్వత్
గుణా న్, ఆజ్యముఖ్యైః, గాయన్ ఉచ్చైః, సామ+అ
భిధః సః, నిగమః, అద్య, పురా, యం, గీతా, అహమ్,
వేదానామ్, అస్మి, ఇతి, త్వాం, భజతి హి

**ప్ర:** తత్ తత్ = ఆ ఆ; మంత్ర ఆత్మక = మంత్రములను కలిగిన, వివిధ = అనేకవిధములు గల; సత్ = ఉత్తమ; దైవత = దేవతలకు సంబంధించిన; (దైవత స్వరములకు సంబంధించిన) ఉపాధి = ఆవరించిన; నిష్ఠాన్ = నిష్ఠ కలిగిన, శస్త్రైః = ఆయుధములచే; స్తోత్రైః = పొగడ్తలచే; ప్ర ఉగక (ప్రయోగక) = మంత్రతంత్రాదులను నడపు, ముఖైః = ప్రయత్నములు కల; త్వత్ = నీ; గుణాన్ = గుణములను, ఆజ్యముఖ్యైః = హోమద్రవ్యము నెయ్యి మొదలైన వాటిచే; గాయన్ = గానము చేయుచు; ఉచ్చైః = బిగ్గరగా; సామ+అభిధః = సామమను పేరు కల; సః = ఆ; నిగమః = వేదము; అద్య = ఇప్పుడు; పురా = పూర్వము; యం = దేనిని; గీతా = గీతలో, అహమ్ = నేను; వేదానామ్ = వేదములలో; అస్మి = అయి ఉన్నాను, ఇతి = అని; స్వవాదీః = తనకుగా తాను చెప్పుకొన్నావని; త్వాం = నిన్ను భజతి = సేవించుచున్నది; హి = కదా;

**తా:** ఓ పరమేశ్వరా! సామమను పేరు కల ఆ వేదము పూర్వము గీతలో "**నేను వేదములలో సామవేదమై ఉన్నా**"నని నువ్వు చెప్పుకొన్నావని – అనేక మంత్రోచ్చారణలతో, హవిస్సులతో నిన్ను సేవించుచున్నది.

ఓ దేవతలకు దేవతలయిన వారిలో ఉత్తముడా! సమస్తము తెలిసినవాడా!సకల శుభ గుణములకు మహా సముద్రము వంటివాడా! దేవతా చక్రవర్తీ! సచ్చిదానంద స్వరూపుడా! (విపులార్థం విశేషాలలో ఉన్నది) సామవేదమందు ప్రేమ కలిగినవాడా! నేను ఈ శ్లోకంతో చేసిన సామవేద సేవను స్వీకరించు.

**వి:** ఉపాధి: ఆవరించినది. కప్పివేసినది. నామరూపాలు చైతన్యాన్ని కప్పి తగ్గించి

చూపుతున్నాయి. చైతన్యం వాటిద్వారా ప్రసరిస్తుంటుంది. ఈ ఆవరణమూ ద్వారమే ఉపాధి. శరీరాదులిలాంటివే. వస్తువు కాభాస ఉపాధి. అదే దాన్ని కప్పుతుంది. అదే దాన్ని విప్పి చూపుతుంది. కప్పితే ఆవరణం. విప్పితే ద్వారం.

సామవేదము: భక్తి రసప్రధానమైనది సామవేదము. అటులనే భారతీయ కళలు కూడా భక్తిరస ప్రధానమైనవి. అందుకనే గీతాచార్యుడు, శ్రీకృష్ణ భగవానుడు “వేదానాం సామవేదోఽస్మి” అని బోధించటం జరిగినది. ఇతర వేదములకు జాతపాఠము, ఘనాపాఠము, క్రమ పాఠము మున్నగునవి ప్రచారములు కాగా, గానము కేవలము సామవేదము పైననే జరుగును. సామవేదము యొక్క శబ్దములలో ఉచ్చరించేటప్పుడు కొంత పరివర్తనం వస్తుంది. వీటిని భావాలు అంటారు. ప్రసిద్ధమైన ఎనిమిది భావములలో ఒకటి వికారము : ఏవో వర్ణముల స్థానముపై రెండవ వర్ణమొనర్చుట వికారము. ఉదా : ‘అగ్నే’ స్థానములో ‘ఓ గ్నా ఇ’ అని ఉచ్చరించుట. అందుకే మనశ్లోకంలో కూడా ప్ర ఉగక అని ఉచ్చరించబడినది. (సామవేద భాష్యము – వేదధర్మప్రచార ట్రస్టు (రి) హైదరాబాద్ – 500060. భాష్యకర్త – విద్యా మార్తాండ రామనాథ వేదాలంకార్, వేద మందిరము, జ్వాలాపుర్ (హరిద్వార్) గారియొక్క సామవేద భాష్యభూమిక నుంచి గ్రహించడమైనది. సేకరణ : ఆకెళ్ళ హేమ కాంత ప్రభాకరరావు)

సచ్చిదానందం: సత్+చిత్+ఆనందం. సత్యం, జ్ఞానం, ఆనందం కలసి పరమాత్మ స్వరూపం. భూత, భవిష్యత్, వర్తమానాల వల్ల మార్పు చెందనిదీ, ఎప్పుడూ ఒకే విధంగా ఉండేది సత్/సత్తు. సచ్చిదానందంలో రెండవదైన చిత్/చిత్తు అంటే ఎరుక. నిరుపాధికం, నిరతిశయం, నిరుపమానం అయి ఎప్పటికీ ఉండే సుఖానుభూతి ఆనందం. దీపానికి ఎరుపు తెలుపుల మిశ్రమ వర్ణం, వేడి, కాంతి ఎలా స్వాభావికంగా కలసి ఉంటాయో అలా సత్తు, చిత్తు, ఆనందం మిళితమై ఉంటాయి. అవి అభిన్నం.

**ఛందస్సు –** ఇది మందాక్రాంతము, 17 అక్షరములు ఉండును. 27 మాత్రలు ఉండును. ప్రతి పాదములో మ,భ,న.త,త (గగ) గణములుండును.

### 4 అథర్వవేదః

**అ:** ఈ శ్లోకంలో కవి అథర్వవేదము ద్వారా ఆ పరమాత్మకు అక్షరసేవ చేస్తున్నారు.

> ఆగ్నేయాది ప్రకృతి మహితానస్త్రయోగాన్ బహూన్య–
> స్తాంస్తాం ధత్తేఽభ్యధికమనుసంధానసంహారయుక్తాన్ ।
> యేన క్షుద్రక్షపణపటవోఽంతర్బహిర్యాగయోగా–
> స్సంవేద్యంతే భజతి పరిశిష్టోఽయమాథర్వణస్త్వామ్ ॥

హే దేవదేవోత్తమ (మే) ! దేవతాసార్వభౌమ (మి)!
అథర్వాంగిరః ప్రభృతి మహర్షి మండల సమభ్యర్చిత!
(తే) అసీచర్మగదాచక్రశూలాద్యాయుధసమేత (తే) అనన్య తేజోభిభవ
బ్రాహ్మపాశుపతాద్యస్త్రరాజ రాజిత (తే)! అథర్వవేద ప్రియతమ (మే)!
అథర్వవేద సేవామవధారయ

**ప:** ఆగ్నేయ, ఆది, ప్రకృతి మహితాన్ అస్త్ర యోగాన్ బహూని, అస్తాం స్తాం ధత్తే, అభి, అధికమ్, అనుసంధాన, సంహార యుక్తాన్, యేన క్షుద్ర క్షపణపటవః అంతః బహిః యాగయోగాః, సంవేద్యంతే భజతి పరిశిష్టః అయమ్ అథర్వణః త్వామ్

**ప్ర:** ప్రకృతి మహితాన్ = సహజంగానే గొప్పవి అయిన; ఆగ్నేయ = అగ్నిని గలిగించు ఆయుధమయిన ఆగ్నేయము, ఆది = మొదలైన; స్తాం = స్తోతృ యోగ్యమైన (శబ్దము కలిగించు); బహూని = అనేక అస్త్రములతో; అస్తాం = బాణములను; యోగాన్ = కూడుకొన్నవి; అనుసంధాన = కూర్పు; సంహార = చంపడములతో, యుక్తాన్ = కూడుకొని; అభ్యధికం = మిక్కిలి అధికంగా (మేలుగా); ధత్తే = ఇచ్చుచున్నది; యేన = దేనిచేత; క్షుద్ర = నీచులయిన; క్షపణ = అశుచులు (బౌద్ధమతస్థులు), అంతః బహిః యాగయోగాః = లోపల బయటాచేసే యాగ యోగాలను, సంవేద్యంతే = తెలియబరుచబడుచున్నవో; పరిశిష్టః = వేదములలో చివరిది అని పేరు పొందిన; అయమ్ = ఈ, అథర్వణః = అథర్వ మంత్రములయొక్క మొత్తముతో, త్వామ్ = నిన్ను, భజతి = సేవించుచున్నది.

**తా:** సహజంగానే గొప్పవి అయిన అగ్నిని గలిగించు ఆయుధమయిన ఆగ్నేయము మొదలైన స్తోతృ యోగ్యమైన (శబ్దము కలిగించు) అనేక అస్త్రములతో బాణములను కూడుకొన్నది; కూర్పు, చంపడములతో కూడుకొని మిక్కిలి అధికంగా మేలును ఇచ్చుచున్నది; అథర్వ వేద బాణ ప్రయోగములచేత నీచులయిన అశుచులు లోపల బయటాచేసే యాగ యోగాలు తెలియబరుచబడుచున్నవి. వేదములలో చివరిది అని పేరు పొందిన ఈ మంత్రములయొక్క మొత్తముతో అథర్వణ వేదము నిన్ను సేవించుచున్నది.

ఓ దేవతలకు దేవతలయిన వారిలో ఉత్తముడా! సమస్తము తెలిసినవాడా! అథర్వుడు, అంగిరుడు మొదలయిన మహర్షి సమూహములతో బాగా పూజింపబడువాడా! కత్తి, చర్మము, గద, చక్రము, శూలము మొదలయిన ఆయుధములతో కూడుకొన్నవాడా! సాటిలేని తేజస్సుతో జన్మించిన బ్రహ్మాస్త్రం, పాశుపతాస్త్రం

మొదలయిన అస్త్ర విశేషములతో ప్రకాశించువాడా! అథర్వ వేదమందు ప్రేమ కలిగినవాడా! నేను ఈశ్లోకంతో చేసిన అథర్వవేద సేవను స్వీకరించు.

**వి:** అథర్వవేద శాఖలు : వేదములలో నాలుగవది. ఇందు ధనుర్వేదాయుర్వేదశాంతిక పౌష్టిక కర్మాది విషయములుండును. అథర్వ వేదంలో తొమ్మిది శాఖలు. ఇవి : పైప్పలాద, తైద, మౌద, శౌనకీయ, జాజల, జలద, బ్రహ్మవద, దేవదర్శ, చారణ వైద్యశాఖలు. (వేదసార రత్నావళి) ఉపనిషత్తులలో ముప్పది ఒక్క ఉపనిషత్తులను అథర్వణ వేదోపనిషత్తులని వర్గీకరించారు. అవి : 1. ప్రశ్నోపనిషత్తు, 2. అథర్వ శిఖోపనిషత్తు, 3. నృసింహ తాపిన్యుపనిషత్తు, 4. శరభోపనిషత్తు, 5. రామ తాపిన్యుపనిషత్తు, 6. అన్నపూర్ణోపనిషత్తు, 7. పాశుపతోపనిషత్తు, 8. దేవ్యుపనిషత్తు, 9. గణపత్యుపనిషత్తు, 10. కృష్ణోపనిషత్తు, 11. అథర్వశిరోపనిషత్తు, 12. నారద పరివ్రాజకోపనిషత్తు, 13. మహా నారాయణోపనిషత్తు, 14. శాండిల్యోపనిషత్తు, 15. సూర్యోపనిషత్తు, 16. పరబ్రహ్మోపనిషత్తు, 17. భావనోపనిషత్తు, 18. మహావాక్యో పనిషత్తు, 19. హయగ్రీవోపనిషత్తు, 20. మాండూక్యోపనిషత్తు, 21. బృహత్ జాబాలో పనిషత్తు, 22. సీతోపనిషత్తు, 23. రామ రహస్యోపనిషత్తు, 24. పరమహంస పరివ్రాజకోపనిషత్తు, 25. ఆత్మోపనిషత్తు, 26. త్రిపురాతపనోపనిషత్తు, 27. భస్మ జాబాలోపనిషత్తు, 28. గోపాలతపనోపనిషత్తు, 29. దత్తాత్రేయోపనిషత్తు, 30. గారుడనామ అథర్వణోపనిషత్తు, 31. ముండకోపనిషత్తు.

ఇతర వేదాల్లో కన్నా భిన్నమైన విజ్ఞాన విషయాలు ఇందులో ఉండటం వల్ల, 'చిట్టచివరిది' అనే అర్థంలోనూ వ్యవహరిస్తారు. శాంతి, పుష్టి కర్మలు పుష్కలంగా ఉండటం ఈ వేదానికి గల ప్రత్యేకత. శాంతి కర్మలు అంటే – చేసిన తప్పులను అపరాధాలను క్షమించి, ఏ ఘోరాలు జరగకుండా చూడమని ప్రార్థించేవి. అథర్వణ వేదంలో రోగాల్ని నివారించేవి, రాజనీతిని బోధించేవి, సామాజిక హితాన్ని కాంక్షించేవి – ఎన్నో విషయాలున్నాయి. చేసిన తప్పుల్ని సరిదిద్దుకొనేవి, ఆయుష్యాన్ని పెంచేవి, శత్రువుల్ని దూరం చేసేవి – వాటితోపాటు, భౌతిక అంతరిక్ష విజ్ఞానాలకు సంబంధించిన అంశాలూ ఉన్నాయి. (శ్రీ అయాచితం నటేశ్వర శర్మ)

నీరు, నిప్పు, సూర్యచంద్రులు, పర్వతాలు, చెట్లు ఇవన్నీ ఈశ్వరమయాలు. అవి మనకు శాంతిని, శుభాన్ని కలిగిస్తాయని అథర్వణ వేదం చెబుతోంది.

**ఛందస్సు –** ఇది మందాక్రాంతము, 17 అక్షరములు ఉండును. 27 మాత్రలు ఉండును. ప్రతి పాదములలో మ,భ,న,త,త (గగ)గణములుండు.

## 5 శీక్షా

**అ :** ఈ శ్లోకంలో కవి శిక్షావల్లి ద్వారా ఆ పరమాత్మకు అక్షరసేవ చేస్తున్నారు.

వర్ణాన్మాత్రాః స్వరాన్ యా స్ఫుటయతి బహుధా వైదికాంస్తాం త్రికాంశ్చ
ప్రోక్తా చారణ్యకేషు ప్రవిలసతి పరా తైత్తిరీయేషు యా వై ।
శీక్షా సేయం శ్రుతీనాం పదఫణితి విధాం సంహితా నిర్దిశంతీ
త్వామారాధ్యాఽద్యధన్యా భవితుముపగతా ప్రాతిశాఖ్యేన యుక్తా ॥

హే దేవదేవోత్తమ! (మే) దేవతాసార్వభౌమ! (మి)!
శిష్ట జనావనా దృత శివ విరించి విష్ణ్వాదిస్వరూప!
(పే) శీక్షాదివల్లీత్రిత్రయానువర్ణితాశేషదివ్యానుభావ!(వే)
శీక్షా ప్రియతమ! (మే) శీక్షా సేవామవధారయ–

**ప:** వర్ణాన్ మాత్రాః స్వరాన్ యాః స్ఫుటయతి బహుధా వైదికాన్ తాం త్రికాన్ చ
ప్రోక్తా చ ఆరణ్యకేషు ప్రవిలసతి పరా తైత్తిరీయేషు యా వై
శీక్షా సా ఇయం శ్రుతీనాం పదఫణితి విధాం సంహితానిర్దిశంతీ
త్వామ్ ఆరాధ్య అద్య ధన్యా భవితుమ్ ఉపగతా ప్రాతిశాఖ్యేన యుక్తా

**ప్ర:** వర్ణాన్ = అకారాది వర్ణములు; మాత్రాః = హ్రస్వ, దీర్ఘ, ప్లుతము (నిబ్బర గమనం – Steady pace) అనే మాత్రలు; స్వరాన్ = ఉదాత్త, అనుదాత్త, స్వరితాలనే స్వర భేదాలు; యాః = ఏ వేదాంగము; బహుధా = అనేకవిధములచేత; స్ఫుటయతి = ప్రకాశింపచేయుచున్నదో; తాం వైదికాన్ = వేదాంగమునకు సంబంధించిన, త్రికాన్ చ = బలం, సామం, సంతానం అను మూడింటిని; ప్ర+ఉక్తా చ = ఏ శిక్షావల్లిలో చెప్పబడినదో; (ఆ శిక్షావల్లి) ఆరణ్యకేషు = అరణ్యమందు రచింపబడిన లేక పఠింపదగిన వేదభాగములయిన ఐతరేయారణ్యకము మొదలగు వానిలో ఉన్న తైత్తిరీయమునందు; పరా = శ్రేష్ఠమై, యా = ఏది; ప్రవిలసతి = బాగా ప్రకాశించు చున్నదో; వై= (పాదపూరణమునకు వాడు అక్షరము); శీక్షా సా = ఆ; శీక్షా = శిక్షావల్లి; ఇయం = ఈ, శ్రుతీనాం = వేదములయొక్క; పదఫణితి విధాం = అక్షరములు పలికే పద్ధతిని; సంహితా = వర్ణ సంయోగాన్ని; నిర్దిశంతీ = నిర్దేశించు చున్నది. ప్రాతిశాఖ్యేన యుక్తా = వేద శాఖలకు ప్రత్యేకంగా ఉన్న వ్యాకరణాలతో (వేద భాష్యం) కూడుకొని ఉన్న; త్వామ్ = నిన్ను; ఆరాధ్య = ఆరాధించి; అద్య = ఇప్పుడు; ధన్యా = ధన్యుడను; భవితుమ్ ఉపగతా = కాగలను.

**తా:** ఓ భగవానుడా! (భగవతీ) అకారాది వర్ణములు, హ్రస్వ, దీర్ఘ, ప్లుతము అనే

మాత్రలు, ఉదాత్త, అనుదాత్త, స్వరితాలనే స్వర భేదాలు బలం, సామం, సంతానం అను మూడింటిని చెప్పిన ఆ శిక్షావల్లి రూపమైన నిన్ను కొలిచెదను; అరణ్యమందు పఠింపదగిన వేదభాగములలో శ్రేష్ఠమైన ఆ శిక్షావల్లి వేదములయొక్క అక్షరములు పలికే పద్ధతిని వర్ణ సంయోగాన్ని నిర్దేశించుచున్నది. వేద శాఖలకు ప్రత్యేకంగా ఉన్న వ్యాకరణాలతో (వేద భాష్యం) కూడుకొని ఉన్న ఆ శిక్షావల్లి స్వరూపుడవైన నిన్ను ఆరాధించి ఇప్పుడు ధన్యుడను కాగలను;

ఓ దేవతలకు దేవతలయిన వారిలో ఉత్తముడా! ఉత్తములచే ఆదరింపబడిన శివుడు, బ్రహ్మ, విష్ణువు మొదలైన దేవతల స్వరూపుడా! శిక్షావల్లి, ఆనందవల్లి, భృగువల్లి అనే మూడింటిలోను క్రమముగా వివరింపబడిన అఖిలమైన దివ్యమైన ప్రభావము కలిగినవాడా! శిక్షావల్లి యందు ప్రేమ కలిగినవాడా! నేను ఈ శ్లోకంతో చేసిన శిక్షావల్లి సేవను స్వీకరించు.

**వి:** 1. శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పము అను వేదాంగములలో ఒకటి శిక్ష.

2. కృష్ణయజుర్వేదంలో తైత్తిరీయోపనిషత్తు ఉంది.

3. ఇది శిక్షావల్లి, ఆనందవల్లి, భృగువల్లి అనే మూడు అధ్యాయాలు

4. శిక్షావల్లిలో పన్నెండు అనువాకాలు ఉన్నాయి.

5. శిక్షను వైదిక సంస్కృతంలో 'శీక్షా' అంటారు.

6. అందుకే మన శ్లోకకారులు కూడా 'శీక్షా' అన్నారు.

7. శిక్ష అంటే విద్యాభ్యాసం. స్వరశాస్త్రం.

8. ఓం శీక్షాం వ్యాఖ్యాస్యామః । వర్ణః స్వరః । మాత్రా బలం । సామ సంతానః । ఇత్యుక్తః శీక్షాధ్యాయః ।

9. అకారము మొదలయిన వర్ణములు, ఉదాత్తము మొదలయిన స్వరభేదాలు; హ్రస్వ, దీర్ఘ, ప్లుతము అను మాత్రలు ఉచ్చరించేటప్పుడు చేయవలసిన బల ప్రయత్న విశేషం, అతి వేగంగాను, మందంగాను కాక మధ్యస్థ వృత్తిగా పలికే సామం, అలసత్వం లేకుండా అక్షరాలను పలికే సంతానం – శిక్షావల్లిలో ఉన్నాయి.

10. ఈశ్లోకం స్రగ్ధర వృత్తం రకానికి చెందినది.

11. ప్రతి పాదంలోను మ,ర,భ,న,య,య,య గణములుండును.

## 6 వ్యాకరణం

**అ:** ఈ శ్లోకంలో కవి వ్యాకరణం ద్వారా ఆ పరమాత్మకు అక్షరసేవ చేస్తున్నారు.

యచ్ఛబ్దానుగమాదృతే న భవతి జ్ఞానం కిమప్యన్యతః
కృత్స్నం వ్యాకరణం మహాత్మన ఇతశ్శాబ్దస్య హి బ్రహ్మణః ।
త్వద్ఢక్కా నవపంచవారనినదాత్సమ్యక్సముద్భావితం
త్వామేవ ప్రతిపద్యతేఽ ఙ్గమధునా పాణిన్యుపజ్ఞం శ్రుతేః ॥

హే దేవదేవోత్తమ ! (మే) దేవతాసార్వభౌమ! (మి)! వ్యావాచకభేదవర్జిత!(తే) వ్యాకరణాచార్యవర్ణ్యమాన వైభవ(వే)! వ్యాకృతా–వ్యాకృతస్వరూప! (పిణి) వ్యాకరణ ప్రియతమ! (మే) వ్యాకరణ సేవామవధారయ–

**ప:** యత్, శబ్ద, అనుగమాత్, ఋతే, న భవతి, జ్ఞానం, కిమ్, అపి అన్యతః
కృత్స్నం, వ్యాకరణం, మహాత్మనః, ఇతః, శాబ్దస్య, హి, బ్రహ్మణః
త్వత్, ఢక్కా, నవపంచవారనినదాత్, సమ్యక్, సముద్భావితమ్
త్వామ్, ఏవ, ప్రతిపద్యతే, అంగమ్, అధునా, పాణిని, ఉపజ్ఞం, శ్రుతేః

**ప్ర:** యత్ = ఏ; శబ్ద = (శివునిఢక్కా) ధ్వనియొక్క వ్యాకరణశిక్షితమైన మాట; అనుగమాత్ = వెంబడించుట; ఋతే = లేనిచో, అధునా = ఇప్పుడు; ఇతః = ఇంతకంటె; జ్ఞానం = శాబ్దిక జ్ఞానము; కిమ్ అపి = కొంచెము కూడా; న భవతి = సంభవించదో; అన్యతః = మరలా; మహాత్మనః = మహాత్ముడవైన; నవ పంచవార నినదాత్ = పదునాలుగు సార్లు మోగించుట వలన; సమ్యక్ = చక్కగా; శాబ్దస్య = శబ్దసంబంధమైన; కృత్స్నం = సమస్త; వ్యాకరణం = శబ్దశాస్త్రము; షడంగములలో ఒకటి; (విశదపరచి లేదా వేరు పరచి చెప్పేది); సముద్భావితమ్ = పుట్టినది; త్వామ్ ఏవ = నీవే; (చే) పాణిని = వ్యాకరణ సూత్రాలను రచించిన పాణిని ముని; బ్రహ్మణః = భగవత్ ప్రాప్తి యొక్క; శ్రుతేః = వినుట వలన; ఉపజ్ఞం = పరుల యుపదేశము లేకయే మొట్టమొదటనే కలుగు జ్ఞానము (మొట్టమొదట తెలిసికొనబడునట్టిది.); ప్రతిపద్యతే = ప్రతిపాదించబడినది; హి = కదా!

**తా:** శివుడు తన తాండవము తరువాత ముక్తాయింపులో డమరుకం మీద పధ్నాలుగు అక్షరాల ధ్వనులు మ్రోగించాడు. ఆ డమరుకం లోంచి వెలువడిన పదునాలుగు అక్షర ధ్వనులతో పాణిని ప్రఖ్యాత వ్యాకరణం (షడంగాలలో ఒకటి) రచించాడు.

దేవతలకు దేవతలయినవారిలో ఉత్తముడా! దేవతలకు సార్వభౌముడా! పదం, దాని అర్థం మధ్య సంబంధ భేదమును విడిచినవాడా ( అనగా శిష్ఠపరంగా రెండింటికి తేడా

లేదని భావం) వ్యాకరణములో వర్ణింపబడిన ఆచార్య వైభవము కలిగినవాడా! విశదీకరింప బడిన, విశదీకరింపబడని రూపము కలవాడా! వ్యాకరణమందు ప్రేమ కలిగినవాడా! నేను ఈ శ్లోకంతో చేసిన సేవను స్వీకరించు.

**వి:** 1. పాణిని పంజాబు ప్రాంతానికి చెందినవాడట. ఎప్పుడు మరణించాడో ఖచ్చితంగా తెలీదు కాని మరణించిన తిథి మాత్రము త్రయోదశి. అందుకే దానిని 'పాణినీయ అనధ్యాపక దినం"గా చెబుతారు. ఆ త్రయోదశి నాడు ప్రాచీన సంప్రదాయంలో పాఠ బోధన జరుగదు.

2. పరమశివుడు తనను గురించి తపస్సు చేసిన ముని కుమారుడు పాణినికి, బ్రహ్మ మానస పుత్రులైన సనక సనందాదులకూ ఉపదేశించిన సూత్రాలను మాహేశ్వర సూత్రాలు అంటారు. ఇవి పధ్నాలుగు. పరమ శివుడు డమరుకం వాయించినప్పుడు వచ్చిన శబ్దాలనే వారు శివోపదేశాలుగా భావించారు. సూత్రాలు : 1. అఇఉణ్, 2. ఋఌ క్ 3. ఏఓఙ్ 4. ఐఔచ్ 5.హయవరట్ 6. లణ్ 7. ఞఫఠథచటతవ్ 8. ఝభఞ్ 9. –మఢధష్ 10. జబగడదశ్ 11. ఖఫఠథచటతవ్ 12. కపయ్ 13. శషసర్ 14. హల్. నందికేశ్వరుడు వీటికి "కాశిక" అనే వ్యాఖ్యానాన్ని రచించాడు. పాణిని ఈ సూత్రాలు ఆధారంగా అద్భుత వ్యాకరణ శాస్త్రాన్ని రచించాడు. మాహేశ్వర సూత్రాలకు శ్రుతి ప్రమాణం లభించింది.

3. జ్ఞానం:

"జ్ఞానం తు ద్వివిధం ప్రోక్తం శాబ్దికం ప్రథమం స్మృతమ్ ।
అనుభవాఖ్యం ద్వితీయం తు జ్ఞానం తద్దుర్లభం మతమ్॥ (దేవీభాగవతము 6-15-52)

జ్ఞానము 1. శాబ్దికము 2. అనుభవము అని రెండు విధాలు.

4. శాబ్ద్యాకాంక్ష శబ్దేనైవ పూర్యతే అని ఒక సంస్కృత న్యాయము క్రియాసంబంధమైన ఆకాంక్ష శబ్దముచేతనే పూరింపబడును.

5. ఉపజ్ఞా జ్ఞా = అవబోధనే. ఉపజ్ఞా శబ్దము ఉత్తరపదముగానున్న తత్పురుష సమాసమున నపుంసకమగును. ఉదా: పాణిన్యుపజ్ఞము వ్యాకరణము మొ॥

6. ఈ శ్లోకం శార్దూలవిక్రీడితము. ప్రతి పాదములోను, మ,స,జ,స,త,త,గ గణములుండును.

### 7 ఛందః

**అ:** ఈ శ్లోకంలో కవి ఛందస్సు ద్వారా ఆ పరమాత్మకు అక్షరసేవ చేస్తున్నారు.

యత్తద్బ్రాహ్మణభాగవర్ణితమితశ్చాంఖ్యాయనాద్యైః పురా
భాగైశ్చ ప్రతిపాదితం కతిపయైః శ్రౌతాది సూత్రాంతరే ।

లోకే పింగళముఖ్యలక్షణ పరిజ్ఞైశ్చాపి విస్తారితం
ఛందస్త్వాం పరిసేవతే హ్యభయదం (దాం) స్వచ్ఛందసంచారిణం(ణీం)॥

**ప:** యత్, తత్, బ్రాహ్మణ భాగవర్ణిత, మితః శాంఖ్యాయన, ఆద్యైః, పురా
భాగైః చ, ప్రతిపాదితం, కతిపయైః, శ్రౌతాది సూత్రాంతరే
లోకే పింగళ ముఖ్యలక్షణ పరిజ్ఞైః చ+అపి, విస్తారితం
ఛందః, త్వాం, పరిసేవతే. హి, అభయదం (దాం), స్వచ్ఛందసంచారిణం(ణీం)

హే దేవదేవోత్తమ! (మే) దేవతాసార్వభౌమ! (మి)! చరాచర జగజ్జీవనాధారభూత(తే) చతుర్వేద ప్రతిపాద్య స్వరూప(పే)! చకిత గోకులాగ్ర జన్మరక్షణ పర(రే)! ఛందః ప్రియతమే! (మే) ఛందస్సేవామవధారయ-

**ప్ర:** యత్ = ఏది (ఏ ఛందస్సు); బ్రాహ్మణభాగవర్ణితమ్ = యజ్ఞతంత్రములను, పురాణ గాథలను చెప్పు ధర్మగ్రంథములయిన వైదిక ధర్మగ్రంథములలో వర్ణించబడినదో, ఇతః = దీనికంటె; తత్ =అది (ఆ ఛందస్సు); శాంఖ్యాయన ఆద్యైః = ఋగ్వేద శాఖలయిన 1. శాకల 2. భాష్కల 3. అశ్వలయన 4. శాంఖ్యాయన 5. మాండూక్యాయన మొదలైన; పురాభాగైః చ = సమీప భాగములలో; ప్రతిపాదితం = ప్రతిపాదింపబడినది; శ్రౌతాది సూత్రాంతరే = వైదిక ధర్మ గ్రంథములయిన శ్రౌతాది సూత్రములలో; కతిపయైః = కొన్ని (ప్రతిపాదింపబడినవి); లోకే = లోకమునందు; పింగళ ముఖ్యలక్షణ పరిజ్ఞైః = పింగళుడు మొదలైన ముఖ్య లక్షణ పూర్ణ జ్ఞానము కలవారితో; చ+అపి = కలిసి; విస్తారితం = విస్తరింపబడిన; ఛందః = ఛందస్సు; త్వాం = నిన్ను; అభయదం(దాం) = అభయమును ఇచ్చుచూ; స్వచ్ఛందసంచారిణం(ణీం) = స్వేచ్ఛాసంచారము చేయుచూ; పరిసేవతే = సేవించుచున్నది; హి = కదా!

**తా:** ఛందస్సు యజ్ఞతంత్రములను, పురాణ గాథలను చెప్పు ధర్మగ్రంథములయిన వైదిక ధర్మగ్రంథములలో వర్ణించబడినది; ఋగ్వేద శాఖలయిన 1. శాకల 2. భాష్కల 3. అశ్వలయన 4. శాంఖ్యాయన 5. మాండూక్యాయన మొదలైన వాటిలో ప్రతిపాదింపబడినది; వైదిక ధర్మగ్రంథములయిన శ్రౌతాది సూత్రములలో కొన్ని ఛందో లక్షణాలు ప్రతిపాదింప బడినవి. లోకములో పింగళుడు మొదలైన ముఖ్య లక్షణ పూర్ణ జ్ఞానము కలవారితో కలిసి విస్తరింపబడిన ఛందస్సు భగవంతుని సేవించుచున్నది.

దేవతలకు దేవతలయిన వారిలో ఉత్తముడా! దేవతలకు సార్వభౌముడా! తిరుగునదియు తిరుగనదియునైన సర్వజగత్తు జీవించుటకు ఆధారమైన వాడా! 1. ఋగ్వేదము, 2. యజుర్వేదము, 3. సామవేదము, 4. అథర్వవేదము అను నాలుగు వేదములందు

ప్రతిపాదింపబడిన స్వరూపము కలవాడా! భయపడిన గోవులను, బ్రాహ్మణులను కాపాడుటలో ఆసక్తి కలిగినవాడా! ఛందమునందు ప్రేమకలిగిన వాడా! నేను ఈ శ్లోకంతో చేసిన ఛందోసేవను స్వీకరించు.

**వి:** 1. పద్య శ్లోక లక్షణము తెలిపెడి శాస్త్రము ఛందస్సు.

2. ఇది మంత్ర బ్రాహ్మణాత్మకమైన వేదరాశి.

3. అక్షర సంఖ్యా నియమం కలిగిన 26 వృత్తాలలో గాయత్రి ఒకటి. గాయత్రిలో నాలుగు పాదాలు, 24 అక్షరాలు ఉంటాయి. గాయత్రి ఛందస్సులో గాయత్రే గాక మరే దేవత మంత్రమైనా, స్తోత్రమైనా ఇమడవచ్చు.

4. వేద మంత్రాలని కూడా ఈ పదానికి అర్థం ఉంది. వేద మంత్రాలు ఛందస్సుల చేత తమను తాము సమాహితం చేసుకోవడం వల్ల వేదం "సంహిత" అయింది.

5. ఛందస్సులు ప్రజాపతి అంగాలు.

6. ఛందస్సులు ఇరువది యాఱు - 1. ఉక్త, 2. అత్యుక్త, 3. మధ్య, 4. ప్రతిష్ఠ, 5. సుప్రతిష్ఠ, 6. గాయత్రి, 7. ఉష్ణిక్కు, 8. అనుష్టుప్పు, 9. బృహతి, 10. పఙ్క్తి, 11. త్రిష్టుప్పు, 12. జగతి, 13. అతిజగతి, 14. శక్వరి, 15. అతిశక్వరి, 16. అష్టి, 17. అత్యష్టి, 18. ధృతి, 19. అతిధృతి, 20. కృతి, 21. ప్రకృతి, 22. ఆకృతి, 23. వికృతి, 24. సంకృతి, 25. అభికృతి, 26. ఉత్కృతి (వృత్తరత్నాకరము 1-19)

7. సప్త-ఛందస్సులుగా వీటిని చెబుతారు.

1.గాయత్రి, 2.ఉష్ణిక్కు, 3.అనుష్టుప్పు, 4.బృహతి, 5.పంక్తి, 6.త్రిష్టుప్పు, 7.జగతి

8. ఛందస్త్వం: ఛందస్సుచేత ఆచ్ఛాదితాలైన రక్ష కలిగించుకోవడం. ఈ శ్లోకంలో "ఛందస్త్వాం" అని సమీప ప్రయోగముండుట చమత్కారం.

9. పింగళుడు "ఛందోవిచితి" అనే 8 అధ్యాయాల ఛందశాస్త్రమును రచించెను. వేద మంత్రములకు సంబంధించిన ఛందస్సులే కాక లౌకిక ఛందస్సులు కూడ ఇక్కడ చెప్పబడినవి.

10. ఏకాదశ-బ్రాహ్మణములు: 1 తైత్తిరీయము, 2.శతపథము, 3.చతుర్వేదములు, 4.ఐతరేయము, 5.కౌషీతకము, 6.కృష్ణయజుర్వేదము, 7.శుక్లయజుర్వేదము, 8.అంతర్యామి (విద్యార్థికల్పతరువు)

11. శ్రౌతసూత్రములు - కొందరు వ్యాఖ్యకారులు ద్రాహ్యాయణ శ్రౌతసూత్రము: వ్యాఖ్యకారుడు - ధన్వి యొక్క "దీపిక". రుద్రస్కందుడు కూడా వ్యాఖ్యవ్రాసెనట.

లాట్యాయన శ్రౌతసూత్రము : వ్యాఖ్యకారుడు – అగ్నిస్వామి. ఇది ఉత్తరభారతమునందు ప్రాచుర్యములో ఉన్నది.

అనుపదసూత్రము: ఇది మనదేశములో అలభ్యము. జర్మనీలో వ్రాతప్రతి కలదట.

నిధనసూత్రము: పతంజలి మహర్షి ప్రోక్తము.

కల్పసూత్రము: గార్గ్యమశక మహర్షి ప్రోక్తము. ఈ సూత్రము ద్రాహ్యాయణ, ఆపస్తంబ, బోధాయన, కాత్యాయన సూత్రములకంటే ప్రాచీనమట. దీని వ్యాఖ్యకారుడు "వరదరాజ"

ఉపగ్రస్థము: కాత్యాయన మహర్షి ప్రోక్తము. వ్యాఖ్యకారుడు వేంకటేశ పండితుడు.

క్షుద్రకల్పసూత్రము: ఆర్షేకల్పసూత్రమునందుగల 17 అఢ్యాయములలో మొదటి 11 అధ్యాయములను కల్పసూత్రమందురు. మిగిలిన 6 అధ్యాయములను క్షుద్రకల్పసూత్ర మందురు. దీనికి "శ్రీనివాసచార్యార్ శతక్రతు తాతాచార్యార్" గారు రచించిన వ్యాఖ్యానము గలదు.

తాణ్డ్యలక్షణము: పంచవిధసూత్రము కల్పానుపదము అనుస్తోత్రము (విశ్వనాథ అచ్యుతదేవరాయలు సామవేదీయ సర్వస్వము – ఏకాదశార్చిక పుస్తకం నుండి)

12. ఈ శ్లోకం శార్దూలవిక్రీడితము. ప్రతిపాదములోను మ,స,జ,స,త,త,గ గణము లుండును.

## 8 నిరుక్తం

అ: మంత్రబ్రాహ్మణవర్తినామితరతః ప్రాసంగికానాం సతాం
శబ్దానాం చ నిరుక్తిమాకలయతే వ్యుత్పత్సు లోకో యతః ।
యాస్కాచార్యముఖైశ్చిరాదధిగతం యన్నామలింగోదయం
త్వాం చాలింగమనామరూపమభినౌత్యఙ్గం నిరుక్తం శ్రుతేః ॥

హే దేవదేవోత్తమ! (మే) దేవతాసార్వభౌమ!(మి)! నిగమాంత సంచారిన్(ణి) నిత్యానిత్యవస్తు వివేకాది సాధన చతుష్టయ సంపత్ప్రదాయక(యిని) నిఖిల శబ్ద నిరుక్త విషయ! నిరుక్త ప్రియతమ! (మే) నిరుక్తసేవామవధారయ–

**ప:** మంత్రబ్రాహ్మణవర్తినాం, ఇతరతః, ప్రాసంగికానాం, సతామ్
శబ్దానాం, చ, నిరుక్తిం, ఆకలయతే, వ్యుత్పత్సులోకః, యతః,
యాస్కాచార్యముఖైః, చిరాత్, అధిగతం, యత్, నామలింగోదయం,
త్వాం, చ, అలింగం, అనామరూపం, అభినౌతి, అఙ్గం, నిరుక్తం, శ్రుతేః.

**ప్ర:** మంత్ర = వేదములలోని మంత్రములలో, బ్రాహ్మణ = బ్రాహ్మణములలో, వర్తినామ్

= ఉండునది; ఇతరతః = వేఱొకచోట; సతామ్ = సజ్జనులయొక్క; శబ్దానామ్ = శబ్దములయొక్క; ప్రాసంగికానామ్ = సంబంధమై (ఉండునది); చ = మరియు; నిరుక్తిమ్ = అర్థనిర్వచనములను; వ్యుత్పత్సులోకః = ప్రావీణ్యపు కోరిక గల లోకానికి; ఆకలయతే = తెలియపరుచుచున్నది; యతః = ఎందునుండి; యాస్కాచార్య = యాస్కాచార్యుని; ముఖైః = నోటిద్వారా; యత్ = ఏ; నామలింగోదయం = పేరు, స్త్రీ, పుంలింగ, నపుంసక లింగ శబ్దముల పుట్టుక; చిరాత్ = శీఘ్రముగా; అధిగతం = పొందబడినదో (అట్టి); శ్రుతేః = శ్రుతియొక్క; నిరుక్తం = నిరుక్తము; చ = కూడా; అలింగమ్ = లింగములేని; అనామరూపమ్ = పేరులేని, రూపములేని; త్వాం అఙ్గం = నీ శరీరమును; అభినౌతి = బాగా ప్రశంసించుచున్నది.

**తా:** ఓ భగవంతుడా! నిరుక్తము వేదములలోని మంత్రములలో, బ్రాహ్మణములలో ఉన్నది. మంచి పండితులయొక్క శబ్దార్థముల అర్థనిర్వచనములను చేయుచున్నది. శబ్ద అర్థ నిర్ణయ ప్రావీణ్యమును ఇచ్చుచున్నది. యాస్కాచార్యునిచే రచింపబడిన వేద సంబంధమయిన నిరుక్తము నామ, లింగముల పుట్టుకను తెలుపుచూ – ఆశ్చర్యకరముగా – లింగా తీతుడవయిన, నామరూపములు లేని నీ శరీరమును బాగా ప్రశంసించుచున్నది. దేవతలకు దేవతలయిన వారిలో ఉత్తముడా! దేవతలకు సార్వభౌముడా! ఉపనిషత్తులందు సంచారము చేయువాడా! 1.నిత్యానిత్య వస్తువివేకం, 2. ఐహికాముష్మిక ఫలభోగ విరాగం, 3. శమదమాది షట్కసంపత్తి (శమం, దమం, ఉపరమ, ఉపరతి, తితిక్ష, శ్రద్ధ, సమాధి), 4. ముముక్షత్వం అను సాధన చతుష్టయ సంపదను ఇచ్చువాడా! (సాధన చతుష్టయ వివరణంలో విశేషాల్లో ఉంది) సర్వ పదాల అర్థ విచారము విషయముగా కలిగినవాడా! నిరుక్తమందు ప్రేమ కలిగినవాడా! నేను ఈ శ్లోకంతో చేసిన ఛందో సేవను స్వీకరించు.

**వి:** 1. నిరుక్తమనగా చెప్పబడినది.

2. షడంగాలలో నిరుక్తము ఒకటి. షడంగాలు ఇవి. 1.శిక్ష (పాణిని), 2.వ్యాకరణం (పాణిని), 3.నిరుక్తం (యాస్కుడు), 4.జ్యోతిషం (ఆపస్తంభుడు), 5.కల్పం (ఆపస్తంభుడు), 6.(...........?)

3. వేదంలోని పదాలకు నిరుక్తం అర్థాన్ని చెబుతుంది.

4. నిరుక్తంలో పన్నెండు అధ్యాయాలు ఉన్నాయి. పూర్వషట్కం, ఉత్తర షట్కం అని రెండు విభాగాలు.

5. మొదటి విభాగంలో పర్యాయపదాలు ఉన్నాయి. ఇంకా ఒక ధాతువు నుండి పుట్టిన పదాల పట్టికలు ఉన్నాయి.

6. రెండో విభాగంలో భాష్యం ఉంది.

7. ఏకాదశ బ్రాహ్మణములు. 1.తైత్తిరీయము, 2.శతపథము, 3.చతుర్వేదములు, 4.ఐతరేయము, 5.కౌషీతకము, 6.కృష్ణయజుర్వేదము, 7.శుక్లయజుర్వేదము, 8.అంతర్యామి (విద్యార్థికల్పతరువు)

8. సాధన చతుష్టయ వివరణం.

1. సృష్టిలో ప్రతివస్తువు ఎప్పుడో ఒకప్పుడు నశించేదే అని సులభంగానే తెలుస్తుంది. అంటే, అవన్నీ అనిత్యాలు. అనిత్యాలు ఉన్నప్పుడు నిత్యమైనది ఏదో ఉండాలి కదా అని జిజ్ఞాస కలుగుతుంది. ఆ విధంగా విచారణ చేయడం, తెలుసుకొనడం, నిత్యానిత్య వస్తువివేకం.

2. భోగాలని వేటిని గురించి భావిస్తున్నామో అవన్నీ అశాశ్వతమైనవే. మనం గమనిస్తున్న ఈ లోకంలోని భోగాలేగాక స్వర్గాది లోకాలలోని భోగాలూ అంతే అనే వైరాగ్య భావన రావడం ఇహాముత్రార్థ భోగ విరాగం.

3. శమదమాది ఆరు సంపదలలో శమం అంటే అంతరింద్రియ నిగ్రహం, దమం అంటే బహిరింద్రియ నిగ్రహం, ఉపరమ/ ఉపరతి అంటే విషయ వాసనలను విరమించు కోవడం.

4. తితిక్ష అంటే వాతావరణ తీవ్రతలను, ఇతర బాధలను ఓర్చుకోవడం, శ్రద్ధ అంటే శాస్త్రాదుల పట్ల, దైవం పట్ల విశ్వాసం కలిగి వ్యవహరించటం, సమాధి అంటే ధ్యానవస్తువులో మనసు లీనం కావడం.

9. మోక్షాన్ని దృఢంగా కోరడమే ముముక్షత్వం. శ్రవణ మనన నిధిధ్యాసలు (నిధి ధ్యాసనం = శ్రవణ మననాల చేత తెలుసుకొన్న అర్థాన్ని/ విషయాన్ని ఏకాగ్రతతో నిరంతరం చింతన చేయడం) మోక్షనిధికి సాధనాలు.

10. ఈ శ్లోకం శార్దూలవిక్రీడితము. ప్రతిపాదములో మ,స,జ,స,త,త,గ గణము లుండును.

## 9 జ్యోతిషం

**అ:** ఈ శ్లోకంలో కవి జ్యోతిష శాస్త్రం ద్వారా ఆ పరమాత్మకు అక్షరసేవ చేస్తున్నారు.

శ్రౌతస్మార్తవిధిప్రయుక్తమఖిలం సత్కర్మజాతం యతో
నిర్దిష్టే హ్యధికారిణాం సుమనసాం కాలే ప్రవర్తేత యత్ ।
కల్యాణప్రచురం సమస్తశుభదం స్కన్ధత్రయోజ్జృంభితం
జ్యోతిశ్శాస్త్రమథో భజత్యతితమాం త్వాం జ్యోతిషాముద్భవమ్ ॥

హే దేవదేవోత్తమ(మే)! దేవతా సార్వభౌమ(మి)! జ్యోతిష్టోమాది క్రతు సమారాధ్య (ధ్యే) జ్యోతిర్మండల మధ్యవర్తిన్(ని)! జ్యోతిష ప్రియతమ(మే) జ్యోతిషసేవా మవధారయ!

**ప:** శ్రౌత, స్మార్త, విధి ప్రయుక్తమ్, అఖిలం, సత్కర్మజాతం, యతః
నిర్దిష్టే, హి, అధికారిణాం, సుమనసాం, కాలే, ప్రవర్తేత, యత్
కల్యాణ ప్రచురం, సమస్త శుభదం, స్కన్ద త్రయోజ్జృంభితమ్
జ్యోతిశ్శాస్త్రమ్, అథః, భజతి, అతితమాం, త్వాం, జ్యోతిషామ్, ఉద్భవామ్

**ప్ర:** శ్రౌత = వేదచోదితమైన యజ్ఞ యాగాదులు; స్మార్త = స్మృతికారులు బోధించిన షోడశకర్మలు; విధి = చేయుటయందు; ప్రయుక్తమ్ = 1. ప్రయోగింపబడినది, 2. మిక్కిలి కూడుకొన్నది; అఖిలం = సమస్తమైన (శిథిలము కానిది. న+ఖిలమ్. (న.త.); సత్కర్మ = మంచి పనులయందు; జాతం = పుట్టినది; యతః = ఎందుకనగా (ఏ); నిర్దిష్టే = నిర్దేశింపఁ బడినదానియందు; హి = కదా; అధికారిణాం = అధికారము కలవారి యొక్క; కాలే = కాలము నందు; ప్రవర్తేత = ప్రవర్తించబడునది; యత్ = ఏది; కల్యాణ = శుభములందు; ప్రచురం = వెల్లడియైనది, విస్తారమైనది; సమస్త = సర్వము, అంతయు; శుభదం = శుభములను ఇచ్చునది; స్కన్దత్రయ+ఉజ్జృంభితమ్ = హోరా, గణిత, సంహితలనెడు మూడు స్కందములతో విరిసినది అయిన; జ్యోతిశ్శాస్త్రమ్ = కాలజ్ఞానము; అథః = ఇప్పుడు; అతితమాం = అత్యున్నతముగా; జ్యోతిషామ్ = జ్యోతిషామ్ – ప్రకాశమానమైనవానిలో చంద్రసూర్యాదిగ్రహ నక్షత్రములందు; ఉద్భవామ్ = పుట్టిన; భజతి = సేవించుచున్నది.

**తా:** ఓ భగవంతుడా! జ్యోతిశ్శాస్త్రము శ్రౌత, స్మార్తములు చేయుటలో ఉపయోగపడుతుంది. వివాహాది శుభకార్యములందు ముహూర్త నిర్ణయాదులలో అధికమైన పాత్ర వహిస్తుంది. శుభములను ఇచ్చునది; హోరా, గణిత, సంహితలనెడు మూడు స్కందములతో కూడుకొన్నది. అటువంటి జ్యోతిశ్శాస్త్రము చంద్రసూర్యాదిగ్రహ నక్షత్రములలో అవతారములు ఎత్తిన నిన్ను సేవించుచున్నది.

దేవతలకు దేవతలయిన వారిలో ఉత్తముడా! దేవతలకు సార్వభౌముడా! జ్యోతిష్టోమం మొదలైన యజ్ఞములందు పూజింపబడినవాడా! గ్రహగత్యాది నిర్ణయశాస్త్రమునందు (జ్యోస్యమునందు) ప్రేమ కలిగినవాడా! సూర్యుని మధ్యలో ఉండువాడా! నేను ఈ శ్లోకంతో చేసిన జ్యోతిష సేవను స్వీకరించు.

**వి:** 1. శ్రౌత: శ్రౌత అనగా శ్రుతికి సంబంధించినదని అర్థం. ముఖ్యంగా కర్మకాండ. దీనికి తోడు స్మార్త అని ఒక మాట ఉన్నది. వేదచోదితమైన యజ్ఞయాగాదులు శ్రౌతమైతే స్మృతికారులు బోధించిన షోడశకర్మలు (1.గర్భాదానము, 2.పుంసవనము, 3.సీమంతము, 4.జాతకర్మము, 5.నామకరణము, 6.అన్నప్రాశనము, 7. చౌలము, 8.ఉపనయనము,

9.ప్రాజాపత్యము, 10.సౌమ్యము, 11.ఆగ్నేయము, 12.వైశ్వదేవము, 13.గోదానము, 14.సమావర్తనము, 15.వివాహము, 16.అంత్యేష్టి) స్మార్తం క్రిందికి వస్తాయి.

2. జ్యోతిస్సులు: జ్యోతిస్సులనగా నక్షత్రములు. వానిని అధికరించి (చదివి) చేయబడిన గ్రంథం జ్యోతిషం. దానిని ఎరిగిన వాడు జ్యౌతిషికుడు.

3. శ్రౌత తుచ్ఛత్వం: తుచ్ఛం అంటే శూన్యం అనే అర్థం ఉంది. అందువల్ల వేదాంత గ్రంథాలు చెప్పే ప్రపంచ మిధ్యాత్వం శ్రౌత తుచ్ఛత్వం అంటారు.

4. శ్రౌత సత్యాత్మ దర్శనం: శ్రుతిలోనూ, ఉపనిషత్తులలోనూ తెలియజేసిన పరిపూర్ణ ఆత్మజ్ఞానం.

5. శ్రౌత స్మార్త క్రియా కల్పాలు: ఆపస్తంబీయ, అశ్వలాయనీయ, బోధాయనీయ కల్పాలు

6. శ్రౌతసూత్రములు అనగా వైదిక ధర్మ గ్రంథములు

7. శ్రౌతి కర్మలు: శ్రోత్రేంద్రియము ద్వారా, గురు బోధలయందు శ్రద్ధ, సహనము ఉన్నటువంటివాడు, అటువంటి బుద్ధి ఎవరికైతే ఉంటుందో వాడు శ్రౌతి. దర్శపూర్ణమాసలు, ఆధానం, అగ్నిస్టోమీయపర యాగం, అగ్నిష్టోమం మొదలైనవి శ్రౌతి కర్మలు. ఇవి చేసే యజమానికి మోత, ఉద్గాత, బ్రహ్మ అనే ఋత్విక్కుల సహాయం అవసరమవుతుంది.

8. అష్టాదశ–జ్యోతిశ్శాస్త్ర ప్రవర్తకులు: 1.సూర్యుడు, 2.పితామహుడు, 3.వ్యాసుడు, 4.వసిష్ఠుడు, 5.అత్రి, 6.పరాశరుడు, 7.కశ్యపుడు, 8.నారదుడు, 9.గర్గుడు, 10.మరీచి, 11.మనువు, 12.అంగిరసుడు, 13.లోమశుడు, 14.పులిశుడు, 15.చ్యవనుడు, 16.పవనుడు, 17.భృగువు, 18.శౌనకుడు.

9. దశవిధ మండలములు: వియన్మండలము, తమోమండలము, మేఘమండలము, విద్యున్మండలము, తారామండలము, జ్యోతిర్మండలము, సూర్యమండలము, చంద్ర మండలము, వహ్నిమండలము, హిరణ్మయమండలము యీ పదింటిని దశవిధ మండలము లంటారు.

10. ఈ శ్లోకం శార్దూలవిక్రీడితం. మ,స,జ,స,త,త,గ గణములు.

10 కల్పః

అ: తత్తచ్ఛాఖీయధర్మాన్ శ్రుతిసమధిగతాన్ శ్రౌతగృహ్యాదిభేదాన్
శిష్టాచారక్రమేణ స్ఫుటమభివిదధత్కల్పసామాన్యసంజ్ఞమ్ ।
సూత్రం హ్యాంగైస్త్రిభిస్స్వైః ప్రతిపదగహనైరుజ్జ్వలైః కర్మముఖ్యైః
కర్మ బ్రహ్మాత్మమూర్తిం కలయతి భవతో దేవ!(భవతీం దేవి!) నైష్కర్మ్యసిద్ధ్యై ॥

హే దేవదేవోత్తమ!(మే) దేవతాసార్వభౌమ! (మి) కర్మబ్రహ్మ మీమాంస కాశ్వలాయన కాత్యాయనాపస్తంబాది మహర్షి మండల సూత్రితానుభావ! (ఏ) కమనీయ నిత్యనైమిత్తిక కామ్యకర్మారాధ్యస్వరూప(పే)! కల్ప ప్రియతమే! (మే) కల్ప సేవామవధారయ!

**ప:** తత్ తత్ శాఖీయ ధర్మాన్, శ్రుతి సమధిగతాన్, శ్రౌతగృహ్యా ఆది భేదాన్
శిష్ట+ఆచార క్రమేణ, స్ఫుటమ్, అభివిదధత్, కల్పసామాన్య సంజ్ఞమ్
సూత్రం, హి, అంగైః, త్రిభిః స్వైః, ప్రతిపద గహనైః, ఉజ్జ్వలైః, కర్మ ముఖ్యైః
కర్మబ్రహ్మ+ఆత్మ మూర్తిం, కలయతి, భవతః, దేవ! (భవతీం దేవి) నైష్కర్మసిద్ధ్యై

**ప్ర:** దేవ! = ఓ దేవుడా! (దేవి = ఓ దేవతా!); తత్ తత్ = ఆయా; శాఖీయ = వేద భాగములకు సంబంధించిన; ధర్మాన్ = ధర్మములను; శ్రుతి = వేదము; సమధిగతాన్ = పొంది; శ్రౌతగృహ్యా = శ్రౌత, గృహ్యా; ఆది భేదాన్ = మొదలయిన భేదములు; శిష్ట+ఆచార క్రమేణ = మంచి ఆచారాలను పాటించు క్రమంతో; స్ఫుటమ్ = స్పష్టమయిన; కల్ప = కల్పమను; సామాన్య = సాధారణమైన; సంజ్ఞమ్ = పేరును; అభివిదధత్ = బాగా ధరించ బడినది (కలుగ చేయుచున్నది, ఊహించబడుచున్నది); ధా ధాతువుకు ముందు, వి, అభి ఉపసర్గలు విదధన్ – విదధతీ–విదధత్); త్రిభిః = మూడు విధాలయిన వేదాలకు సంబంధించిన; స్వైః = అలతి అలతి మాటలతో; ప్రతిపద = పర్యాయపదము; ఒక్కొక్క పదము; గహనైః = ఎఱుగరాని, చొరరాని; ఉజ్జ్వలైః = 1. ప్రకాశించునది. 2. వికసించునది, 3. అడ్డులేనిది, 4. కూడినది. (జ్వల దీప్తౌ–ఉత్+జ్వల్+అచ్.); సూత్రం = సూత్రములతో; హి = కదా; అంగైః = ఋగ్వేదులకు అశ్వలాయన సూత్రాలు మొదలయిన విభాగాలతో; కర్మ ముఖ్యైః = వేద విహిత కర్మల విధివిధానాలను తెలియజేయుచూ (కర్మలలో ఒక త్రయం – పుణ్య, పాప, మిశ్రమ కర్మలు. మరొక త్రయం – విధి, నిషేధ, ప్రాయశ్చిత్తాలు); భవతః = మీయొక్క; కర్మబ్రహ్మ+ఆత్మ మూర్తిం = ఆత్మ మూర్తిని; నైష్కర్మసిద్ధ్యై = అపేక్ష, ఆనందము అను రెండు లేకుండా ఉదాసీనతతో చేయు కర్మసిద్ధి కొరకు; కలయతి = కలిగించుచున్నది.

**తా:** ఓ దేవుడా! (దేవి = ఓ దేవతా!) వేదభాగములకు సంబంధించిన ధర్మములను పొంది శ్రౌత, గృహ్యా మొదలయిన భేదములతో మంచి ఆచారాలను పాటింపచేయుచూ కల్పమను సాధారణమైన పేరును ధరించినది.

ఆ కల్పము మూడు విధాలయిన వేదాలకు (ఋగ్యజుస్సామ వేదాలకు) సంబంధించిన; అలతి అలతి మాటలతో ఎఱుగరాని ఒక్కొక పదమును ప్రకాశింపచేయు సూత్రములతో ఆశ్వలాయన సూత్రాలు, కాత్యాయన సూత్రాలు మొదలయిన విభాగాలతో వేదవిహిత

కర్మల విధివిధానాలను తెలియజేయుచూ మీయొక్క కర్మ బ్రహ్మాత్మమూర్తిని ఆపేక్ష, ఆనందము అను రెండు లేకుండా ఉదాసీనతతో చేయు కర్మసిద్ధికొరకు రచయితనైన నాకు (శ్రీ శాస్త్రుల విశ్వనాథ శర్మగారికి) కలిగించు చున్నది;

దేవతలకు దేవతలయిన వారిలో ఉత్తముడా! దేవతలకు సార్వభౌముడా! కర్మబ్రహ్మ, మీమాంసక, ఆశ్వలాయన, కాత్యాయన, ఆపస్తంబుడు మొదలయిన మహర్షులు చెప్పిన కల్ప సూత్రాలతో ఏర్పాటుచేయబడిన ప్రభావము కలవాడా! అందమైన నిత్యనైమిత్తిక కామ్య కర్మలతో ఆరాధింపదగిన స్వరూపము కలిగినవాడా! (నిత్య కర్మలనగా, నిత్యమూ తప్పక చేయవలసినవి. ఉదా: సంధ్యావందనములు నిత్యకర్మలు. మన ఇష్టముతో నిమిత్తము లేకుండా ఆయా సందర్భములు వచ్చినపుడు తప్పక చేయవలసిన వాటిని నైమిత్తిక కర్మలు అంటారు. శ్రాద్ధములు, ఉపాకర్మ, గ్రహణ సమయములలో చేయు హోమములు మొదలైనవి నైమిత్తిక కర్మలు. మనముగా కోరి చేసే పూజలు, వ్రతాలు, గణ, రుద్ర, హోమములు కామ్మకర్మలు.) కల్పమునందు ప్రేమ కలిగినవాడా! నేను ఈ శ్లోకంతో చేసిన కల్ప సేవను స్వీకరించు.

**వి :**1. కల్పం అనే మాటకి మొదటి వివరణ ఇది. కొన్ని మన్వంతరాలు ఒక కల్పం. వేయి మహాయుగాలు ఒక కల్పం.. మహా యుగం అంటే కృత, త్రేత, ద్వాపర, కలియుగాలు అనే నాలుగు యుగాల కాలం. ఈ మహాయుగంలో చివరిదైన కలియుగం కొనసాగుతున్నది. సంధ్యావందనంలో "శ్వేతవరాహకల్పం", "వైవస్వత మన్వంతరం", "కలియుగే ప్రథమపాదే" అనే కాలం గురుతులను చెపుతుంటాము. వర్తమాన కాలంలో సంధ్యావందనంలో చెప్పే 'శ్వేత వరాహ కల్పం...'లో ఇప్పటికి ఆరు మన్వంతరాలు గడిచాయి. ఇప్పుడు (అంటే విక్రమార్క/శాలివాహన/క్రీస్తు శకాలు జరుగుతున్నకాలం) ఏడవదైన వైవస్వత మన్వంతరం నడుస్తున్నది. కల్పాలు 18. అవి 1.కూర్మ, 2.మత్స్య, 3.శ్వేతవరాహ, 4.నృసింహ, 5.వామన, 6.స్కంధ, 7.రామ, 8.భాగవత, 9.మార్కండేయ, 10.భవిష్య, 11.లింగ, 12.బ్రహ్మాండ, 13.అగ్ని, 14.వాయు, 15.పద్మ, 16.శివ, 17.విష్ణు, 18.బ్రహ్మ కల్పాలు అని 18 కల్పాలు ఉన్నట్టు భవిష్య పురాణం తెలియజేస్తున్నది.

2. కల్పం అనే మాటకి రెండవ వివరణ ఇది. కల్పమనగా వేద విహిత కర్మల విధి విధానాలను తెలియజేసే శాస్త్రం. షడంగాలలో ఒకటి. దీనికే కల్పసూత్రాలు అని ఇంకొక పేరు. ప్రస్తుత శ్లోకంలోని కల్ప పదం ఈ రెండవ వివరణకు సంబంధించినది.

3. కల్పసూత్రాలు: షడంగాలలో ఒకటైన కల్పశాస్త్రమే కల్ప సూత్రాలు. ఇవి శ్రౌత, ధర్మ, గృహ్యా సూత్రాలని త్రివిధాలు. వైదిక ధర్మాలను అనుష్ఠించడం కోసం మహర్షులు

రూపొందించిన సూత్రాలు ఇవి. ఋగ్వేదులకు ఆశ్వలాయన సూత్రాలు, శుక్ల యజుర్వేదులకూ, ప్రథమ శాఖ వారికీ కాత్యాయన సూత్రాలు, కృష్ణయజుర్వేదులకు ఆపస్తంబ సూత్రాలు, సామవేదులకు త్రాహియాయన సూత్రాలు, వైఖానసులకు వైఖానస సూత్రాలు (ఆపస్తంబ సూత్ర భేదం) అనుష్ఠించదగినవి. వాడుకలో ఉన్న సూత్రాలలో కొన్ని; ఆపస్తంబ, అగస్త్య, శాకల్య, బోధాయన, అగ్నివైశ్య, అశ్వలాయన, వాధూల, శాంభవీయ, శౌనకీయ, కౌండిన్య, కాత్యాయన, సత్యాషాఢ, కౌషీతకీ, త్రాహియాయణ, హిరణ్యకేసి, జైమినీయ, వైఖానస, భారద్వాజ, మాధ్వందిన, శాండిల్య సూత్రాలు.

4. శిష్టత్వం/ శిష్టాచారం: 1. మంచి నడవడి శిష్టత్వం. మంచి ఆచారాలను పాటించడం శిష్టాచారం.

2. దానం, సత్యవ్రతం, తపస్సు, లోభరాహిత్యం, విద్య, యజ్ఞం, పూజ, దమం మొదలైన యోగ్యతలు కలిగిన సత్పురుషుల ప్రవర్తన, సదాచారం.

5. కలయతి: నీవెవరు? అన్న అర్జునుడి ప్రశ్నకు సమాధానముగా, శ్రీకృష్ణుడు తన ప్రవృత్తిని సర్వ శక్తివంతమైన కాలస్వరూపముగా, విశ్వ వినాశకారిగా తెలియచేస్తున్నాడు. 'కాల' అన్న పదం 'కలయతి' అన్న పదం నుండి వచ్చింది. అదే సమాన అర్థం 'గణయతి' అన్న పదానికి కూడా ఉంది, అంటే 'లెక్కించుట' అని అర్థం. సమస్త ప్రకృతి ఘటనలు అన్నీ కాలంలో కలిసిపోతాయి. మొట్టమొదటి అణుబాంబు తయారీలో పనిచేసిన ఓప్పెన్హైమర్ (oppenheimer) హిరోశిమా, నాగాసాకిల విధ్వంసం చూసిన పిదప, శ్రీకృష్ణుడు చెప్పిన కాలోఽస్మి లోకక్షయకృత్ ప్రవృద్ధో.... (గీత 11-32) శ్లోకాన్ని ఆంగ్లంలో "Time... I am the destroyer of all the worlds " అన్నాడట : (అంతర్జాల సౌజన్యంతో)

6. నైష్కర్మ్యము: నైష్కర్మ్యము అంటే ఆసక్తత లేక ఆపేక్ష, ఆనందము అను రెండు లేకుండా ఉదాసీనతతోకర్మ చెయ్యటము. నైష్కర్మ్యము వలన సమదర్శనము లేక సమత్వము కలుగుతుంది. దానివలన సాక్షిత్వము లభిస్తుంది.

7. ఈ శ్లోకం స్రగ్ధరా వృత్తంలో ఉంది. ప్రకృతి ఛందమునకు చెందిన 302993వ వృత్తము. 21 అక్షరములు ప్రతిపాదములో మ,ర,భ,న,య,య,య గణములు.

## 11 పూర్వమీమాంసా

అ: న్యాయానాం చ సహస్రముత్తమమథో బిభ్రద్యదుజ్జృంభతే
యద్ద్వి ద్వాదశలక్షణాత్మకమిదం జైమిన్యుపజ్ఞం మహత్ ।
యత్ప్రాభాకరభాట్టనామకశుభప్రస్థానయుగ్మాంచితమ్
తత్త్వాం వాక్యవిచారశాస్త్రమధునా పూర్వం భజత్యాదరాత్ ॥

హే దేవదేవోత్తమ! (మే) దేవతాసార్వభౌమ! (మి)! మీన కూర్మాద్యవతార్ సమాసాదిత జగత్కల్యాణ(ణే)! మితహితమేధ్యాశి యోగిజనమేయ స్వరూప(పే)! మీమాంసా ప్రియతమ! (మే) మీమాంసా సేవామవధారయ!

**ప:** న్యాయానాం, చ, సహస్రమ్, ఉత్తమమ్, అథః, బిభ్రత్, యత్ ఉజ్జృంభతే
యత్, వై, ద్వాదశ లక్షణాత్మకమ్, ఇదం, జైమిని+ఉపజ్ఞం, మహత్
యత్, ప్రాభాకరభాట్టనామక, శుభ ప్రస్థాన, యుగ్మ+అంచితమ్
తత్త్వాం, వాక్యవిచార శాస్త్రమ్, అధునా, పూర్వం, భజతి, ఆదరాత్.

**ప్ర:** సహస్రమ్ = వేయి; (అనేక) న్యాయానాం = తర్కశాస్త్రములలో; చ = మరియు; ఉత్తమమ్ = ఉత్తమమైనది; అథః = అథాతో ధర్మజిజ్ఞాసా అను వాక్యముతో; బిభ్రత్ = ధరించబడియుండునది; యత్ = దేనివలన; ఉజ్జృంభతే = స్ఫుటముగా ప్రకాశించు చున్నదో; యత్ = ఏది; వై = పాద పూరణవాచకం; ద్వాదశ లక్షణాత్మకమ్ = 12 అధ్యాయాలుగా, 60 పాదాలుగా ఉన్నదో; ఇదం = ఈ; మహత్ = గొప్పది; జైమిని +ఉపజ్ఞం = జైమిని అను మునిచే మొట్టమొదట తెలిసికొనబడునట్టిదో; యత్ = ఏది; ప్రాభాకర = కుమారిలభట్టు శిష్యుడైన ప్రభాకరమిశ్రుడు గురువుగారు జైమినీయ పూర్వమీమాంసకు వ్రాసిన వార్తికల వ్యాఖ్య; భాట్ట = కుమారిలభట్టు వ్రాసిన వ్యాఖ్య కుమారిలభాట్టము; నామక = అను పేర్లతో; శుభ = శుభమైన; ప్రస్థాన యుగ్మ+ అంచితమ్ = పారమార్థిక విషయాలను బోధించు; వాక్యవిచార శాస్త్రమ్ = వాక్య విచార శాస్త్రము; తత్త్వాం = తత్త్వాత్మకమై; ఆదరాత్ = నీ ఆదరము వలన; అధునా = ఇప్పుడు; పూర్వం = పూర్వము; భజతి = సేవింపబడుచున్నది.

**తా:** ఓ భగవానుడా! ఈ పూర్వమీమాంస అను శాస్త్రం అనేక తర్కశాస్త్రములలో ఉత్తమమైనది. అథాతో ధర్మజిజ్ఞాసా అను వాక్యముతో ప్రారంభించబడినది; 12 అధ్యాయాలుగా, 60 పాదాలుగా ఉన్నది. జైమిని అను మునిచే మొట్టమొదట తెలిసికొనబడినది.

కుమారిలభట్టు వ్రాసిన వ్యాఖ్య కుమారిలభాట్టము మరియూ, కుమారిలభట్టు శిష్యుడైన ప్రభాకరమిశ్రుడు గురువుగారు జైమినీయ పూర్వమీమాంసకు వ్రాసిన వార్తికావ్యాఖ్యలను పారమార్థిక విషయాలను బోధించు రెండు గొప్ప వ్యాఖ్యలు కలిగి ఈ పూర్వ మీమాంస అను వాక్యవిచార శాస్త్రము తత్త్వాత్మకమై నీ ఆదరము వలన పూర్వము, ఇప్పుడూ కూడా నిన్ను సేవించుచున్నది. (సహృదయులచే సేవింపబడు చున్నది.)

దేవతలకు దేవతలయిన వారిలో ఉత్తముడా! దేవతలకు సార్వభౌముడా! మత్స్యము, కూర్మము మొదలైన అవతారముల ద్వారా జగత్తునకు శుభమును అందించినవాడా! మితహితుడు, మేధ్యాశి, యోగిజనమేయుల స్వరూపములు కలిగినవాడా! మీమాంసయందు ప్రేమ కలిగినవాడా! నేను ఈ శ్లోకంతో చేసిన మీమాంస శాస్త్ర సేవను స్వీకరించు.

**వి:** 1. ద్వివిధ దర్శనములు: 1. ఆస్తిక్య దర్శనములు (న్యాయ వైశేషికాదులు), 2. నాస్తిక్య దర్శనములు (చార్వాకాదులు).

2. షట్-దర్శనములు: 1. న్యాయము, 2. వైశేషికము, 3. వేదాంతము, 4. మీమాంస, 5. సాంఖ్యము, 6. యోగము. (ఇవి ఆస్తికదర్శనములు)

**"పాణినేర్జైమినేశ్చైవ వ్యాసస్య కపిలస్య చ, ।**
**కణాదస్యాక్షపాదస్య దర్శనాని షడేవ హి ॥"** -ప్రతాపరుద్రీయమువ్యాఖ్య 1-21

3. కర్మకాండకు సంబంధించిన పూర్వ భాగాన్ని వివరిస్తుంది కనుక పూర్వమీమాంస అని పేరు వచ్చింది. మీమాంస అంటే వివేచించడం, వితర్కించడం, విచికిత్స చేయడం.

4. పూర్వమీమాంసా కర్త జైమిని. భారత రచయిత కూడా.

5. కర్మకాండను, యజ్ఞ యాగాలపై విశ్వాసాన్ని పునరుద్ధరించడమే జైమిని సూత్రాల ఉద్దేశం.

6. 12 అధ్యాయాలుగా, 60 పాదాలుగా ఉన్నాయి. మీమాంసా దర్శనములో 2500 సూత్రాలున్నాయి. దీనికి కర్మ మీమాంస, ధర్మ మీమాంస అనే పేర్లు కూడా ఉన్నాయి.

7. "అథాతో ధర్మజిజ్ఞాసా" (ఇప్పుడు ధర్మాన్ని గురించి వివేచన చేద్దాము) అని జైమిని పూర్వ మీమాంసా సూత్రాలు మొదలవుతాయి.

8. ఉపజ్ఞం: మొట్టమొదట తెలిసికొనబడునట్టిది. జ్ఞా = అవబోధనే-ఉప+జ్ఞా+అజ. (కృ. ప్ర.) ఉపజ్ఞాశబ్దము ఉత్తరపదముగానున్న తత్పురుష సమాసమున నపుంసకమగును. ఉదా:- పాణిన్యుపజ్ఞము వ్యాకరణము మొ॥ ఈ శ్లోకంలో "జైమిన్యుపజ్ఞం" అన్నారు.

9. ప్రాభాకర మనగా కుమారిలభట్టు శిష్యుడైన ప్రభాకరమిశ్రుడు గురువుగారు జైమినీయ పూర్వమీమాంసకు వ్రాసిన వార్తికవ్యాఖ్యను పెక్కు విషయములలో భేదించి తాను స్థాపించిన మతానికి ప్రాభాకర మను పేరు పెట్టాడు. కుమారిలభాట్టమునకు గురుమత మని, ప్రభాకరుని మతమునకు శిష్యమతమని ప్రఖ్యాతి.

10. "ఆంధ్రత్వ మాంధ్రభాషాచ ప్రాభాకర పరిశ్రమః తత్రాపి యాజుషీశాఖా నాల్పస్య తపసః ఫలమ్" (ఆంధ్రభాష, భట్టప్రభాకరుని పాండిత్యం, అందులో యాజుషశాఖలో పుట్టడం తపఃఫలం) అని అప్పయ దీక్షితులు అన్నారు.

11. ప్రస్థానత్రయం: ఉపనిషత్తులు, భగవద్గీత, బ్రహ్మసూత్రాలు అనే మూడు ఆధ్యాత్మిక గ్రంథాలు. (ఉపనిషత్తులను వేదాంతమనీ, బ్రమ్మ సూత్రాలను ఉత్తర మీమాంస అని కూడా అంటారు.) ప్రస్థానం అంటే గమనం అనే సామాన్యార్థంతో పాటు పారమార్థిక విషయాలను బోధించునది అని కూడా ఒక అర్థం ఉంది. 2. ఉపనిషత్తులు (వేదాంతం), భగవద్గీత, బ్రహ్మసూత్రాలు ఈ మూడింటి భాష్యాలు.

12. ప్రస్థానచతుష్టయము: 1. దశోపనిషత్తులు, 2. బ్రహ్మసూత్రములు, 3. భగవద్గీత, 4. భాగవతము. ఈ శ్లోకంలో కుమారిలభట్టు వ్రాసిన వ్యాఖ్య కుమారిలభాట్టము మరియూ కుమారిలభట్టు శిష్యుడైన ప్రభాకరమిశ్రుడు గురువుగారు జైమినీయ పూర్వమీమాంసకు వ్రాసిన వార్తికవ్యాఖ్యలను కలిపి ప్రస్థాన యుగ్మం అన్నారు.

13. వాక్యవిచార శాస్త్రము: పరా, పశ్యంతి, మధ్యమ, వైఖరీ అనే నాలుగు విధాలుగా వాక్కును విశ్లేషించే సందర్భంలోనే మరొక పద్ధతిలో కూడా వాక్య విభజన జరిగింది. ఉపనిషత్తులలోని వాక్యాలు ద్వివిధాలు. 1. అవాంతర వాక్యాలు, 2. మహా వాక్యాలు. తిరిగి అవాంతర వాక్యాలను ఐదు విధాలుగా వర్గీకరించారు. 1. గుణవాక్యాలు, 2. క్రియా వాక్యాలు, 3. జాతి వాక్యాలు, 4. విధి వాక్యాలు, 5. నిషేధ వాక్యాలు.

14. తత్త్వం: వేదాంత పరిభాషలో తరచు తటస్థపడే పదం. చాలా అర్థాలు ఉన్నాయి. అందులో కొన్ని. 1. బ్రహ్మం, 2. సత్యం/యథార్థ స్థితి, 3. చేతస్సు/మానసం, 4. సృష్టికి తొలుదొలుత స్థితి. ఈ స్థితికి వివిధ సిద్ధాంతాల వారు తమ విశ్వాసాలకు అనుగుణమైన అర్థాలు చెప్పారు. అద్వైతులు బ్రహ్మం అన్నారు. ద్వైతులు స్వతంత్రమనీ, అస్వతంత్రమనీ అన్నారు. విశిష్టాద్వైతులు చిత్తు, అచిత్తు, ఈశ్వర రూపాలన్నారు. సాంఖ్యులు 24 పదార్థాల కూటమి అన్నారు.

15. ఈ శ్లోకం శార్దూలవిక్రీడితము. అతిధృతి ఛందమునకు చెందిన 149337వ వృత్తమిది. 19 అక్షరములు. మ,స,జ,స,త,త,గ గణములు.

12 ఉత్తరమీమాంసా

అ: సత్యం జ్ఞానమనంతమాదికపదైస్తైస్తైః స్వరూపార్థదై-
ర్భేదాపోహచణైరతన్నిరసనైర్యా తత్త్వమస్యాదిభిః ।

ధీరా౽ విందత నేతి నేతి విధయా శ్రుత్యంతసీమంతినీ
యా సాక్షాద్భజతే, భవంతమధునా (ధునాంబ! భవతీం) సర్వాపరోక్షం (క్షాం)
శివం (వాం) ॥

హే దేవదేవోత్తమ! (మే) దేవతాసార్వభౌమ! (మి)! వేదాంత విజ్ఞాన సునిశ్చితార్థ విజ్ఞజనానుభూయమాన బ్రహ్మాత్మభావ! (వే) వేదోక్త ప్రవృత్తి నివృత్తి లక్షణ ధర్మద్వయా-మూలభూత(తే) వేదాంతశాస్త్ర ప్రియతమ!(మే) వేదాంతశాస్త్ర సేవామవధారయ!

సత్యం జ్ఞానమనంత మాదికపదై స్తైస్తైః స్వరూపార్థదై ర్భేదాపోహచణైఃరతన్నిరస-నైర్యాతత్త్వమస్యాదిభిః ధీరా౽ విందత నేతి నేతి విధయా శ్రుత్యంత సీమంతినీ యా సాక్షాద్భజతే, భవంతమధునా(ధునాంబ! భవతీం) సర్వాపరోక్షం (క్షాం) శివం(వాం)

**ప:** సత్యం జ్ఞానమ్, అనంతమ్, ఆదికపదైః, తైః తైః స్వరూపార్థదైః,
భేద, అపోహచణైః రతన్, నిరసనైః, యా, తత్త్వమ్, అస్యాదిభిః
ధీరా అవిందత, నేతి నేతి విధయా, శ్రుత్యంత సీమంతినీ
యా, సాక్షాత్, భజతే, భవంతమ్, అధునా (అధునా+అంబ! భవతీం)సర్వ+అపరోక్షం (క్షాం) శివం(వాం)

**ప్ర:** సత్యం = సత్యము; జ్ఞానమ్ = జ్ఞానము; అనంతమ్ = అనంతము మొదలైన, ఆదికపదైః = మొదలగు పదములతో; తైః తైః = వాటి వాటితో (ఆ పదాలతో); అస్య = దీనియొక్క (ఈ ఉత్తర మీమాంస యొక్క); భేద = భేదములు; అపోహ = లేనిది ఊహించుట; చణైః = నేర్పరులతో; రతన్ = ఆమోదముల; నిరసనైః = తిరస్కారములతో; ఆదిభిః = మొదలైన వాటితో, తత్త్వమ్ = 1.పరమాత్మ, 2.స్వభావము; ధీరా = విద్వాంసులు; శ్రుత్యంత సీమంతినీ = ఉపనిషత్తుల పాపటను; విధయా = విధితో; నేతి నేతి = ఇదికాదు, ఇదికాదు పద్ధతితో; అవిన్దత = (లజ్ పరస్మైపదీ మ.బ. విద్ లాభే) పొందుచున్నారు; యా = దేనితో; సాక్షాత్ = సాక్షాత్తుగా; సర్వ+అపరోక్షం(క్షాం) = మొత్తము; అపరోక్షం = ప్రత్యక్షము. (అక్ష్ణః పరమ్-పర+అక్షి-టచ్-పర+అక్ష-ర ఇత్యత్ర పరోక్షే లిట్-ఇతి నిపాతనాత్ అకారస్య ఓకారః -పరోక్షమ్-న+పరోక్షమ్). భవంతమ్ = మిమ్ములను; అధునా = ఇప్పుడు; (అధునా+అంబ! భవతీం) శివం (వాం) = శుభకరమైనదానిని; భజతే = సేవింపబడుచున్నది; (భజ్ సేవాయామ్ ఆత్మనేపది. ప్ర.ఏ.)

**తా:** ఓ భగవానుడా! (ఓ దేవతా!) ఈ ఉత్తర మీమాంసా శాస్త్రం (బ్రహ్మసూత్రాలు) సత్యము, జ్ఞానము, అనంతము మొదలైన, మొదలగు పదముల భేదములు, ఊహలు ఆమోదములు తిరస్కారములు మొదలైన వాటితో పరమాత్మ (స్వభావము) ఆవిష్కరించుచున్నది.

విద్వాంసులు ఉపనిషత్తుల పాపటయైన ఈ ఉత్తర మీమాంసా శాస్త్రంలో ఇది కాదు, ఇది కాదు పద్ధతిలో లాభం పొందుచున్నారు. అటువంటి ఉత్తర మీమాంసా శాస్త్రం నిన్ను సేవించుచున్నది.

దేవతలకు దేవతలయిన వారిలో ఉత్తముడా! దేవతలకు సార్వభౌముడా! వేదాంగ విజ్ఞానముతో బాగా నిశ్చయింపబడిన అర్థ నిపుణులచే అనుభవింపబడిన బ్రహ్మాత్మ భావము కలవాడా! వేదమునందు చెప్పబడిన ప్రాపంచిక విషయాలకు అనుకూలమగు ప్రవృత్తి మరియూ నివృత్తిమార్గ లక్షణ ధర్మములకు మూలభూతమైనవాడా! వేదాంతశాస్త్రమందు ప్రేమ కలిగినవాడా! నేను ఈ శ్లోకంతోచేసిన వేదాంతశాస్త్ర సేవను స్వీకరించు.

**వి:** 1. వేదాంతశాస్త్రం : వేదాంతశాస్త్రమనగా బ్రహ్మసూత్రాలు. ఇది వేదవ్యాస విరచితం. వేదంలో జ్ఞానకాండకు సంబంధించినది. (కర్మకాండకు సంబంధించిన భాగం పూర్వ మీమాంస). మీమాంస అంటే విమర్శ. విచారణ చేయడం అని సామాన్యార్థాలు. వేదాలకు చివరి భాగాలైన ఉపనిషత్తుల అర్థాన్ని తెలియచేసేది గనుక ఉత్తర మీమాంస అని ఒక వివరణ. వేదాలలో చివరి భాగాలను తీసుకొని పైకి పరస్పరము విరుద్ధంగా కనిపించే వేద వాక్యాలకు/ ఉపనిషద్వాక్యాలకు బ్రహ్మానికి సంబంధించినవిగా "బ్రహ్మ సూత్రాలు" రచించడం జరిగింది. అందుకే శ్లోకంలో శ్రుత్యంత సీమంతినీ అను పదబంధ ప్రయోగం జరిగింది.

2. "సత్యం జ్ఞానమనంతం" అనేవి బ్రహ్మస్వరూప లక్షణాలుగా బ్రహ్మసూత్రాలలో జన్మాద్యధికరణం సమాప్తమయింది. వాటి ప్రస్తావనను శ్లోకకర్త మొదట్లో తీసుకువచ్చాడు.

3. శరీరంతో ఉన్న జీవుని యథార్థస్వరూపాన్ని చర్చిస్తుంది కాబట్టి బ్రహ్మ సూత్రాలకు శారీరకమీమాంస అని ఇంకో పేరు. ఉపనిషత్తులు శ్రవణ ప్రధానమైతే బ్రహ్మ సూత్రాలు మనన ప్రధానము. మనన మంటే విచారణ.

4. బ్రహ్మసూత్రాలు నాల్గు అధ్యాయాలుగా ఉంది. ప్రతి అధ్యాయమూ నాలుగు పాదాలుగాను, ఒక్కొక్క పాదమూ కొన్ని అధికరణాలుగా, ఒక్కో అధికరణము కొన్ని సూత్రాలతోను ఉంది.

5. మొదటి అధ్యాయంలో 134 సూత్రాలు 39 అధికరణాలు సమన్వయాధ్యాయంగా చెప్పబడింది. బ్రహ్మమే ప్రపంచ సృష్టికి మూల కారణం. మరేది కాదని సమన్వయించి చూపాడు కాబట్టి సమన్వయాధ్యాయమని పేరు వచ్చింది. అథాతో బ్రహ్మ జిజ్ఞాసా అనే సూత్రంతో ఆరంభ మవుతుంది. కార్యరూపమైన ప్రపంచానికి నిమిత్తోపాదానాలు రెండూ పరమాత్మే. కనుకనే ప్రపంచానికెంత అతీతమో అంత దగ్గరగా ప్రపంచంలో ప్రతి అణువూ మృత్తికలాగా వ్యాపించి ఉన్నాడు. ఇదీ బాదరాయణులు చేసిన సమన్వయం.

6. రెండవ అధ్యాయంలో 157 సూత్రాలు 47 అధికరణాలుగ అవిరోధాధ్యాయం ఉంది. సువర్ణమొక్కటే, కంటెలు, కమ్మలు, కాసుల దండలు, ఒడ్డాణాలు దాని విభూతి లేదా విస్తారం. దీనికే సంస్థానమని పేరు పెట్టారు భగవత్పాదులు. సువర్ణ సంస్థాన మాభరణాలయినట్టే సంత్సంస్థానమే Constitution ఈ ప్రపంచం. మొదలగు విషయాలు ఇందులో ఉన్నాయి.

7. మూడవదైన సాధనాధ్యాయంలో 186 సూత్రాలు 67 అధికరణాలుగ పొందు పరచబడింది. సంసారము ఒక బంధం మానవుడికి. ఈ సమస్య నుంచి బయటపడాలంటే నేనా పరమాత్మనే అనే పరిపూర్ణజ్ఞానమందుకోవాలి. ఇటువంటి సాధనా చర్చ ఈ అధ్యాయంలో కనిపిస్తుంది.

8. నాల్గవదైన ఫలాధ్యాయంలో 78 సూత్రాలు, 38 అధికరణాలు ఉన్నాయి. వస్తుసిద్ధంగా ముక్తులమే మనం. బుద్ధిసిద్ధంగా కాకుండా పోయాము. మరలా వస్తువును గుర్తిస్తే అది వస్తుబుద్ధి కాబట్టి ఎప్పుడూ ముక్తులమే ననే ప్రత్యభిజ్ఞ కలుగుతుంది. ఆ జ్ఞానాగ్ని లో ఈ జ్ఞేయమంతా సమిధల లాగా కాలి బూడిద అయిపోతుంది. కాబట్టి అసలు సంసార బంధమనే ప్రశ్నే లేదు. దీనికే ప్రవిలాపన Through merger మని పేరు పెట్టారు. ఇదే జీవిత పరమార్థమైన మోక్ష ఫలం. (బ్రహ్మశ్రీ యల్లంరాజు శ్రీనివాసరావుగారి వాక్యాలను సంగ్రహీకరించటమైనది.)

9. స్వరూపార్థదైః, అపోహచణైః రతన్, నిరసనైః మొదలగు పదాలలో ఈ శ్లోకంలో పై అధ్యాయ సూచనలు జరిగాయి.

10. నేతి నేతి వాదం: బ్రహ్మం అంటే 'ఇది కాదు', 'ఇది కాదు' అంటూ ఇవేవీకానిది బ్రహ్మం అని సిద్ధాంతీకరించే వాదం. సాక్షాత్తు వ్యాసమహర్షి వ్రాసినదిగా పేరున్న 'సిద్ధాంత తత్త్వదర్శనం'లో నేతి నేత్యన్తః' అనే సూత్రం ఈ వాదానికి ఒక అధారం. నిషేధ పూర్వకంగా ఇది కాదు, ఇది కాదు అంటూ అనిర్వచనీయమైనది ఏదో అదే బ్రహ్మం అని ఈ సిద్ధాంతం ప్రతిపాదిస్తుంది. (శ్రీ దువ్వూరి రామకృష్ణారావు సంపాదకత్వం వహించిన 'సంధ్యావందనమ్' అనే సాయణ భాష్యానుసరణ గ్రంథం నుంచి)

11. ఈ శ్లోకం శార్దూలవిక్రీడితము. అతిధృతి ఛందమునకు చెందిన 149337వ వృత్తమిది. 19 అక్షరములు. మ,స,జ,స,త,త,గగణములు.

## 13 న్యాయః

**అ:** ఈ శ్లోకంలో కవి న్యాయశాస్త్రము ద్వారా ఆ పరమాత్మకు అక్షరసేవ చేస్తున్నారు.

శాస్త్రార్థానిహ ధర్మధర్మికవిమర్శార్థోపపన్నాన్ విదు-
ర్యస్మాత్తత్ప్రవణం శ్రుతిప్రథితసన్మార్గప్రతిష్ఠాపకమ్ ।
శ్రీమన్మౌనికణాదగౌతమప్రశస్తాచార్యసంభావితం
శాస్త్రం తద్ధి విమర్శనేన భజతే త్వాం వై విమర్శోదయమ్ ॥

హే దేవదేవోత్తమ! (మే) దేవతాసార్వభౌమ!(మి)! న్యాయాన్యాయపథ ప్రవృత్త సజ్జన దుర్జనాధృత రక్షణ శిక్షణ(ణే)! న్యాయాన్యాయాతీత స్వభావ (వే) న్యాయశాస్త్ర ప్రియతమ (మే)! వేదాంతశాస్త్ర సేవామవధారయ!

**ప:** శాస్త్రార్థాన్, ఇహ, ధర్మ, ధర్మిక, విమర్శ, అర్థ, ఉపపన్నాన్, విదుః
యస్మాత్, తత్, ప్రవణం, శ్రుతి, ప్రథిత, సత్+మార్గ, ప్రతిష్ఠాపకం
శ్రీమత్+మౌని, కణాద, గౌతమ, ప్రశస్త, ఆచార్య సంభావితం
శాస్త్రం, తత్, హి, విమర్శనేన, భజతే, త్వాం, వై, విమర్శ+ఉదయమ్

**ప్ర:** ఇహ = ఇక్కడ (న్యాయశాస్త్రంలో); శాస్త్ర+అర్థాన్ = నియమన గ్రంథములైన శాస్త్రములయొక్క అర్థములను; ధర్మ = పుణ్యము; న్యాయము; సామ్యము; స్వభావము; ఆచారము; అహింస; వేదోక్తవిధి, ఉపనిషత్తు; యజ్ఞము, సత్కార్యము; ధర్మి = ధర్మము కలిగినవిగా; విమర్శ = గుణదోషవివరణములుగా; అర్థ = శబ్దార్థముల; ఉపపన్నాన్ = పుట్టుక కలవానిగా; విదుః = భావింతురు (విద్ జ్ఞానే); యస్మాత్ = ఎందువలన; తత్ = అది (న్యాయశాస్త్రం); ప్రవణం = 1.ప్రత్యక్షం, 2.అనుమానం, 3.ఉపమానం, 4.శబ్దం అను నాలుగింటిద్వారా (చతుష్పథము); ప్రథిత = ప్రఖ్యాతినొందిన; శ్రుతి = వేదముయొక్క; సత్+మార్గ = ఉత్తమ మార్గమును; ప్రతిష్టాపకం = స్థాపించినది; శ్రీమత్ = సంపదగలవాడు, ఒప్పిదము గలవాడు; మౌని = మౌనముగలవాడు, ముని; ప్రశస్త = ప్రసిద్ధికెక్కిన; ఆచార్య = శాస్త్రాలను చక్కగా అధ్యయనం చేసి, అందులోని ధర్మాలను, ధర్మసూత్రాలను అర్థం చేసుకుని వాటినన్నింటినీ ఒక క్రమ పద్ధతిలో రూపొందించుకుని తాను వాటిని అనుష్ఠించడమేగాక, ఇతరులు ఆచరించడానికి సహాయపడేవారు ఆచార్యులయిన (అచినోతి చ శాస్త్రార్థం ఆచారే స్థాపయత్యపి/ స్వయ మాచరతే యస్తు స ఆచార్య ఇతి స్మృతః) వేదవ్యాఖ్యానము చేయువారయిన; కణాద = కణాదుడు; గౌతమ = గౌతముడు మొదలగు వారిచే; సంభావితం = (ఈ న్యాయశాస్త్రం) చక్కగా తలపబడినది; తత్ = ఆ; శాస్త్రం = న్యాయశాస్త్రం; వై = పాద పూరణ వాచకం; విమర్శ+ఉదయమ్ = గుణదోష వివరణముల ఉన్నతికొరకు (పుట్టుక కొరకు); విమర్శనేన = విచారణతో; త్వాం =

భగవంతుడవైన నిన్ను; భజతే = (భజ్ సేవాయామ్ ఆత్మనేపదమ్ లట్ ప్ర.పు.ఏ. భజతే భజేతే భజన్తే) సేవించుచున్నది. హి = కదా!

**తా :** న్యాయశాస్త్రం 1.ప్రత్యక్షం, 2.అనుమానం, 3.ఉపమానం, 4.శబ్దం అను నాలుగింటిద్వారా ప్రఖ్యాతినొందిన వేదముయొక్క ఉత్తమ మార్గమును స్థాపించినది; వేదవ్యాఖ్యానము చేయువారయిన కణాదుడు, గౌతముడు మొదలగు వారిచే చక్కగా గుణదోషవివరణములు చేయుచూ విచారణతో భగవంతుడవైన నిన్ను సేవించుచున్నది.

దేవతలకు దేవతలయిన వారిలో ఉత్తముడా! దేవతలకు సార్వభౌముడా! న్యాయ, అన్యాయ మార్గములలో మునిగిన మంచివారిని, చెడ్డవారిని ఆదరించి రక్షించి, శిక్షించువాడా! (మంచివారిని రక్షించి, చెడ్డవారిని శిక్షించునని భావం) న్యాయము, అన్యాయములకు అతీతమైన స్వభావము కలవాడా! న్యాయశాస్త్రమందు ప్రేమ కలిగినవాడా! నేను ఈ శ్లోకంతో చేసిన వేదాంతశాస్త్ర సేవను స్వీకరించు.

**వి:** 1. న్యాయశాస్త్రం: న్యాయాన్ని వేదానికి ఉపాంగంగా పేర్కొంటారు. మీమాంస ప్రమాణం ద్వారా సహాయపడితే, న్యాయం యుక్తుల ద్వారా సహాయపడుతుంది. న్యాయాన్ని తర్కమనీ, “అన్వీక్షికి” అని కూడా అంటారు.

2. న్యాయశాస్త్రాన్ని తర్కశాస్త్రమని కూడ అంటారు. దీనిని కూర్చినది గౌతమ మహర్షి.

3. న్యాయశాస్త్రాన్ని రచించిన గౌతముడ్ని అక్షపాదుడని కూడ అంటారు. ఆయన ఎల్లవేళలా చింతనా పరుడై బాహ్య ప్రపంచాన్ని పట్టించుకొనేవాడు కాడట. ఈ రోజులలో కూడ పరిశోధనలలో నిమగ్నమైన ఆచార్యులనీ, శాస్త్రజ్ఞులనీ పరధ్యాన పరులంటారు. వారి పరధ్యానం పరిహాసానికి పాత్రమయింది కూడాను. గౌతము డటువంటి వాడే. ఒకసారి నడుస్తూ నూతిలో పడిపోయాడు. భగవంతుడతనిని రక్షించి మళ్లీ అటువంటి ప్రమాదం జరుగకుండా, ఆయన పాదాలకు కళ్లని పెట్టాడని ఇతిహాసం కూడా ఉంది. ఆయనకి తెలియకుండా వేసే అడుగుల వల్ల ఏ ఎదురుదెబ్బలూ తగులకుండా ఉండేట్టు ఆ కళ్లు నివారించేట్టు ఆశీర్వచనం చేశాడట భగవంతుడు. కాళ్లకే కళ్లు కలిగియుండటం వల్ల ఆయన పేరు అక్షపాదుడు (కాళ్లల్లో కళ్లు కలవాడు) అయింది.

4. తర్కం(యుక్తుల) ద్వారా ఈ సృష్టికి కర్త పరమేశ్వరుడేనని నిరూపించటమే న్యాయశాస్త్రం యొక్క ముఖ్య ఉద్దేశం. ఇది ఈశ్వరుని ఉనికిని సహేతుకంగా ప్రతిష్ఠిస్తుంది. ఈ శాస్త్రానికి ముఖ్యమైన సాధనం తార్కిక పద్ధతి. (హేతు విచారణ పద్ధతి)

5. కణాదులు కూడ న్యాయశాస్త్రం రచించాడు. దానిని వైశేషిక మంటారు. వైశేషికానికి మరొకపేరు కూడా ఉంది. అది "ఔలూక్య దర్శనం" "ఉలూక"మంటే గుడ్లగూబ. ఇదే ఆంగ్లంలో Owl అయింది. కణాదునే ఉలూకమనే వారట. తన చింతనలో పరధ్యానంగా ఉంటూ నూతిలో గౌతముడు పడ్డాడు. కణాదుడు పగలంతా తన పరిశోధనలలో నిమగ్నమై భిక్షాటనం రాత్రిళ్ళు చేసుకునే వాడట అందువల్ల "గుడ్లగూబ" అన్న పేరు వచ్చింది. (భగవద్గీతలో కృష్ణభగవానుడు అజ్ఞాని రేయి, జ్ఞాని పగలు అని అన్నప్పుడు జ్ఞానులను గుడ్లగూబలుగా వర్గీకరిస్తాడు). కణాదుడు చెప్పిన సిద్ధాంతమవటం చేత వైశేషికాన్ని కణాదశాస్త్రమని కూడ అంటారు.

6. రెండు పదార్థాలు విభిన్నములని అన్నామంటే ఆ రెంటిలో ఏదో ప్రత్యేకత లుండటం వల్లే – ఒకదానిలోని లక్షణాలు రెండవ దానిలో లేకపోవటం వల్లనే. ఈ విశేషమే పరిశీలనకి మూలమవటం వల్ల ఆ పద్ధతిని వైశేషిక మంటారు. న్యాయశాస్త్రం శాస్త్రీయ పద్ధతిలో నడుస్తుంది. జీవుడు, జగత్తు, ఈశ్వరుడు, మోక్షము వంటి అధ్యాత్మిక విషయాలను ప్రస్తావించేటప్పుడు వైశేషికాన్ని చేరుతుంది. ఈ విషయాలనే వైశేషికులు "అపవర్గ" మంటారు. ఈ రెండూ తర్కాన్నీ, తత్త్వాన్నీ ఉపయోగిస్తాయి. తత్త్వాన్ని తర్కం ద్వారా బోధిస్తాయి.

7. మౌలిక సత్యాన్ని నాలుగు సాధనాల ద్వారా న్యాయశాస్త్రం చర్చిస్తుంది. 1. ప్రత్యక్షం, 2. అనుమానం, 3. ఉపమానం, 4. శబ్దం.

8. వీటిలో మొదటిది ప్రత్యక్షప్రమాణమనేది మనకి జ్ఞానేంద్రియాల వల్ల అనుభవ సిద్ధమయ్యేది. అంటే చూపు, వాసన, వినికిడి, రుచి ఇత్యాది .

9. రెండవది అనుమానం. పొగమాత్రమే కనబడుతున్నా మనకి ఆ కొండ మీద నిప్పు అంటుకొన్నది అని నిశ్చయించు కోవటానికీ ఏ సందేహమూ ఉండదు. దీనినే అనుమాన మంటారు. కొండ మీద మంట ఉండి ఉండాలని మనం నిశ్చయం చేసుకోవటానికి ఉపకరించే సాక్ష్యం పొగే. దీనిని సాధనమనిగాని, లింగమనిగాని, హేతువని గాని అంటారు.

10. ప్రత్యక్షంగా గోచరం కాని దానిని ఇతర సాక్ష్యాల సహాయంతో గుర్తించ గలగటానికి అనుమాన మొక్కటే సాధనం. పరమాత్మ, జీవాత్మలు మన జ్ఞానేంద్రియాలైన కళ్లు, చెవులు, నోరు, ముక్కు వంటి వాటి పరిధిలోకి రావు. మోక్షమనే అంతిమ స్థితి వాటి కందదు. దీనిని అనుమానం వల్లనే, హేతుబద్ధమైన అనుమానం వల్లనే, గ్రహింపగలుగుతాం. తెలియని దానిని తెలిసినదాని సహాయంతో గ్రహించటమే అనుమానమంటే.

11. ఉపమానమంటే ఏమిటి? మనకి తెలియని దాని గురించి తెలిసిన దాని సహాయంతో తెలుసుకోవటం. "గవయమ్" అనే పశువుంది. కాని అదెట్లా ఉంటుందో మనకి తెలియదు. అది గోవువలె ఉంటుందంటారు. అడవి ప్రాంతానికి వెళ్ళినప్పుడు ఆ వర్ణనకి సరిపోయిన ఒక పశువుని చూస్తాం. అదే "గవయమ్" కాబోలు ననుకుంటాం. ఇది ఉపమానం.

12. శబ్ద ప్రమాణం. వేదోక్తి, మహనీయుల ప్రవచనం, వేదాలు గాని, మహర్షుల వంటి మహనీయులుగాని ఏదైనా చెప్తే దానిని ప్రమాణంగా స్వీకరించాలి. అవి అసత్యాలెప్పటికీ కావు కనుక. నైయాయికులు (న్యాయశాస్త్రాన్ని అనుసరించేవారు) వేదాలు భగవంతుని పలుకులే అని నమ్ముతారు. ఆ కారణం చేతనే అవి ప్రమాణాలు. మనోవాక్కాయ కర్మలుగా సత్యవ్రతులైన మహనీయుల పలుకులు కూడ "శబ్ద ప్రమాణం"గా పరిగణింప బడుతాయి.

13. ఒక దక్షిణాత్యుడు తర్కశాస్త్రాన్ని అభ్యసించటానికి నవద్వీపం వెళ్లాడు. ఆ రోజులలో, ఈ శాస్త్ర పండితులు ఎందరో బెంగాలులో ఉండేవారని పేరు. దక్షిణ దేశం నుండి వెళ్లినాయన మంచి కవి. తన కావ్యాల వల్ల ఎంతో సంపదనార్జించాడు. ప్రామాణ్యవాదం గురించి ప్రత్యక్షంగా నేర్చుకుందామని నవద్వీపం వెళ్లాడు. ఎంత చదివినా బాగా అర్థం కాలేదతనికి. ఇంకా ప్రయత్నించాడు. దానితో అతని కవిత్వధార దెబ్బతిన్నది. ఎప్పుడూ తర్కంతోనే తంటాలు పడుతూండటం వల్ల అతని కవితలోని సొగసు సన్నగిల్లింది. అతను తీసికొని వెళ్లిన సొమ్ముకూడ ఖర్చయిపోయింది. రెండు విధాలా నష్టపోయాడు. ఎంతో దుఃఖించాడు. ప్రామాణ్యవాదం అర్థం కాకపోవటంతో, తనలో – మిగిలిన కవితాగంధంతో ఇట్లా అన్నాడు. "నా కవిత్వాన్నే అపహరించిన ప్రామాణ్యవాదానికొక నమస్కారం"! "నమఃప్రామాణ్యవాదాయ మత్కవిత్వాపహారిణే" (కంచికామకోటి పీఠాధిపతులు జగద్గురు శంకరాచార్య శ్రీశ్రీశ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ – మహాస్వామివారి ఉపన్యాసములు ఆచార్యవాణి పుస్తకంలోని ద్వితీయ సంపుటము నుండి ఈ న్యాయ విశేషాలు సంగ్రహింపబడినవి.)

14. కణాద దర్శనం : కణాదుడనే ఋషి రచించినది కనుక దీనికి కణాద దర్శనం అని పేరు. వైశేషిక దర్శనంగా ఇది ప్రసిద్ధం. దీనికే ఔలూక్య దర్శనం అని కూడా ఒక పేరు ఉంది. పావురం వలె ఒక్కొక్క కణాన్ని, గింజలను ఏరుకొని తింటాడు కనుక కణాదుడనీ, ఉలూక మహర్షి కుమారుడు కనుక ఔలూక్యుడనే పేరు వచ్చిందనీ అంటారు. ఇతడు తపస్సు చేసినప్పుడు ఈశ్వరుడు ఉలూకం, అంటే గుడ్లగూబ

రూపంలో ప్రత్యక్షమైనాడు కనుక ఔలూక్యుడనే పేరు వచ్చిందని మరొక ఐతిహ్యం ఉంది. ప్రమాణం మొదలైన పదార్థాల తత్త్వజ్ఞానం వల్ల మోక్షం లభిస్తుందని గౌతమ ఋషి తమ న్యాయసూత్రం/శాస్త్రంలో చేసిన ప్రతిపాదనను ఆమోదిస్తూనే ఈ జగత్తులో ఎన్ని విధాలైన పదార్థాలు ఉన్నాయో, వాటి ధర్మాలేమిటో స్పష్టంగా తెలిస్తేనే గాని ఆత్మ స్వరూప జ్ఞానం కలగదనీ కణాదుడు భావించాడు. వాటి స్వరూపం తెలియాలనే అభిప్రాయంతో కణాదుడు ఏడు పదార్థాలను ప్రతిపాదించాడు. ఈ విశేషాన్ని బట్టి వైశేషికం అనే పేరు ప్రసిద్ధమైనదని ఆచార్య పుల్లెల శ్రీరామచంద్రుడు తమ "సర్వ దర్శన సంగ్రహం" గ్రంథంలో వ్రాశారు.

15. ఈ శ్లోకం శార్దూలవిక్రీడితము. అతిధృతి ఛందమునకు చెందిన 149337వ వృత్తమిది. 19 అక్షరములు. మ,స,జ,స,త,త,గ గణములు.

## 14 ఆయుర్వేదః

**అ :** ఈ శ్లోకంలో కవి ఆయుర్వేదము ద్వారా ఆ పరమాత్మకు అక్షరసేవ చేస్తున్నారు.

ఆద్యం సాధనమామనంత ఋషయో ధర్మస్య దేహం పురా
ప్రాహుస్తస్య హితాహితం తదుదితం దుఃఖం సుఖం ప్రాణినామ్ ।
ఆయుస్తస్య హితాహితం తదను తన్మానం చ యస్మిన్నసా-
వాయుర్వేద ఉపాస్త ఆదిపురుషం (జననీం) త్వాం వై విరాడాత్మకం (త్మికాం) ॥

హే దేవదేవోత్తమ! (మే) దేవతాసార్వభౌమ! (మి)! ఆయుర్వేద సముద్ధరణాధృత ధన్వంతర్యవతార! (రే) అఖండ యోగైశ్వర్య విరాజమాన కాశ్యప పతంజలి ప్రభృతి మహర్షి మండలోద్ధారిత చికిత్సాది వివిధ ప్రస్థాన(నే) ఆయురారోగ్య ప్రదాయక! (యిని) ఆయుర్వేద ప్రియతమ! (మే)! ఆయుర్వేద సేవామవధారయ!

**ప :** ఆద్యం, సాధనమ్, ఆమ్, అనంత, ఋషయః ధర్మస్య, దేహం, పురా
ప్రాహుః, తస్య, హిత+అహితం, తత్, ఉదితం, దుఃఖం, సుఖం, ప్రాణినాం
ఆయుః, తస్య, హిత, అహితం, తత్ అను, తత్, మానం, చ, యస్మిన్, అసౌ
ఆయుర్వేద, ఉపాస్త, ఆదిపురుషం, (జననీం), త్వాం, వై, విరాట్, ఆత్మకం(త్మికాం)

**ప్ర :** అనంత = అంతులేని; ధర్మస్య = ధర్మము యొక్క; ఆద్యం = మొదటి; సాధనమ్ = ఉపకరణముగా; దేహం = శరీరమును; పురా = గతించిన కాలములో; ఋషయః = ఋషులు (ఋషి గతౌ జ్ఞానముచే సంసార పారమును చేరువాడు); ప్రాహుః = చెప్పుదురు; ఆమ్ = అది నిశ్చయమే కదా; తస్య = దానియొక్క (ఆ శరీరము యొక్క); హిత+అహితం = మేలు మరియూ కీడును; తత్ = ఆ శరీరమందు; దుఃఖం = బాధ, చింత; సుఖం =

సుఖము; ఉదితం = (ఆయుర్వేదమందు) చెప్పబడినది; ప్రాణినాం = ప్రాణులయొక్క; ఆయుః = ఆయుస్సు, (ఇణ్ గతౌ – కడచిపోవునది); తస్య = ఆయుస్సుయొక్క; హిత+అహితం = మేలు, మరియూ కీడును (అనగా ఆయుసుసను పెంచునవి, హానిచేసే విషయాలను); తత్+అను = వాటిని అనుసరించి; తత్+మానం = చేయవలసిన చికిత్సా ప్రమాణాలను; చ = కూడా; యస్మిన్ = దేనియందు చెప్పబడినవో; అసౌ = ఆ; ఆయుర్వేద = రోగచికిత్సను దెల్పెడు వైద్యశాస్త్రము. ఆదిపురుషం = మూల పురుషడవైన (జననీం); వై = పాదపూరణ శబ్దం; విరాట్+ఆత్మకం (త్మికాం) = లోకమే స్థూలదేహంగా కల; త్వాం = నిన్ను; ఉపాస్త = సేవించుచున్నది.

**తా :** ధర్మము యొక్క మొదటి సాధనముగా శరీరమును పూర్వము ఋషులు చెప్పుదురు. ఆ శరీరములోని వాత, పిత్త, కఫాలనే త్రిదోషాలకు సంబంధించిన వివిధ విషయాలను, మేళ్లను, కీడులను చర్చించి శరీరానికి చక్కటి ఆయుర్వేద చికిత్సలు దేనియందు చెప్పబడినవో ఆ రోగచికిత్సను దెల్పెడు వైద్యశాస్త్రము మూలపురుషుడవైన లోకమే స్థూలదేహంగా కల నిన్ను సేవించుచున్నది.

దేవతలకు దేవతలయిన వారిలో ఉత్తముడా! దేవతలకు సార్వభౌముడా! ఆయుర్వేదమును ఉద్ధరించుటకు ధన్వంతరి అవతారము ఎత్తినవాడా! సమస్తమైన యోగమను ఐశ్వర్యములతో ప్రకాశించే కాశ్యపుడు, పతంజలి మొదలైన మహర్షి సమూహములు ఉద్ధరించిన చికిత్సలు మొదలైన వాటి మార్గము కలవాడా! ఆయుర్వేదమందు ప్రేమ కలిగినవాడా! నేను ఈ శ్లోకంతో చేసిన ఆయుర్వేదసేవను స్వీకరించు.

**వి :**1. ఆయుర్వేదం అనగానే గుర్తుకు వచ్చే మహర్షి ధన్వంతరి.

2. సముద్ర మథనం తర్వాత ధన్వంతరి ఒక చేతిలో అమృత భాండాన్ని, మరోచేతిలో శంఖాన్ని, ఇంకో చేతిలో చక్రాన్ని ధరించి దర్శనమిచ్చినట్లు పురాణాలు చెబుతున్నాయి.

3. సూర్యుని వద్ద (భాస్కరుడు) ధన్వంతరి ఆయుర్వేదం నేర్చుకున్నట్లుగా బ్రహ్మవైవర్త పురాణం. సూర్యుని 16 శిష్యుల్లో ధన్వంతరి ఒకరు.

4. భూమి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశం. సృష్టిలోని ప్రతి వస్తువుకూ ఈ పంచ భూతాలే మూలాధారం. అందుకే శరీరాన్ని కూడా పంచభూతాత్మకంగా నిర్వచించింది ఆయుర్వేదం! ఈ పంచభూతాలు మన శరీరంలో వాత, పిత్త, కఫాలనే మూడు దోషాల రూపంలో ఉంటాయి. అందుకే ఆయుర్వేద వైద్యం యావత్తూ ఈ త్రిదోషాల ఆధారంగానే సాగుతుంది.

5. మన శరీర రక్షణకు – రస, రక్త, మాంస, మేధో, అస్థి, మజ్జ, శుక్రములనే ఏడు

ధాతువులు; స్వేదం మూత్రం, పురీషాలనే మూడు మలాలు... వాత, పిత్త, కఫాలనే త్రిదోషాలు... ఇవన్నీ కూడా సాధారణ స్థితిలో ఉండటం చాలా ముఖ్యం. అప్పుడే చక్కటి రక్షణ సాధ్యమవుతుంది. కానీ వీటిలో వాత, పిత్త, కఫాలనే త్రిదోషాలకు స్వతహాగా చెడిపోయే స్వభావం ఉంది. అంతేకాదు, మిగతావాటినీ చెడగొడతాయి. అందుకే వీటిని దోషాలన్నారు. ఈ దోషాలు సమానస్థితిలో ఉంటే శరీరాన్ని రక్షిస్తాయి. అవి వికృతి చెందితే వ్యాధులను కలిగిస్తాయి. అయితే ఈ దోషాలు ఎంత ప్రకోపించినా... సప్త ధాతువులు బలంగా ఉంటే ఆరోగ్యం దెబ్బతినే అవకాశాలు తక్కువ. అందుకే ధాతుపుష్టి ముఖ్యం. దోషాలు వికృతి చెందటమే వ్యాధులకు మూలం కాబట్టి... వ్యాధులు రావటానికి మూలం దోషాలే కాబట్టీ... వ్యాధి చికిత్స అన్నది మూలాలను సరిచేసేదిగా ఉండాలన్నిది మౌలిక సూత్రం! ఇలా మూలాలను సరిచేసేదే శోధన చికిత్స.

6. ఆయుర్వేదం ప్రకారం చికిత్సలు రెండు రకాలు.

7. 1. శోధన చికిత్స, 2. శమన చికిత్స. శోధన చికిత్స వ్యాధికి కారణమైన దోషాలను తొలగించి, వాటిని సమావస్థకు తీసుకువచ్చేందుకు ఉద్దేశించినది. ఈ శోధన చికిత్సలో ముఖ్యమైనవే పంచకర్మ చికిత్సలు! ముందు ఈ శోధన చికిత్స చేసి, దోషాలను తొలగించిన తర్వాత అప్పుడు... ఔషధాలతో శమన చికిత్స చేస్తే... ధాతువులు వృద్ధిపొంది... వ్యాధి నుంచి సంపూర్ణమైన స్వస్థత చేకూరుతుంది. ధాతువులకు ధారణశక్తి పెరిగి, వ్యాధి తిరిగి రాకుండా ఉంటుంది.

(డా॥ యస్. మాణిక్య శర్మగారు ఈనాడు దినపత్రిక 31.07.2018 సుఖీభవలో వ్రాసిన వ్యాసంలోని కొన్ని భాగాలు ఆయుర్వేద పరిచయం కొరకు గ్రహించబడినవి.)

8. ఈ శ్లోకం శార్దూలవిక్రీడితము. 19 అక్షరములు. మ,స,జ,స,త,త,గ గణములు.

## 15 కావ్యమ్

**అ:** ఈ శ్లోకంలో కవి కావ్యము ద్వారా ఆ పరమాత్మకు అక్షరసేవ చేస్తున్నారు.

వ్యుత్పత్తిః ప్రభుసమ్మితాద్భవతి యా శబ్దప్రధానశ్రుతే-
ర్యాచార్థప్రవణాత్పురాణవచనాదిష్టా సుహృత్సమ్మితాత్ ।
తామేషా సుకుమారకోమలధియో వ్యుత్పాదయంతీ పరా,
కావ్యశ్రీర్భజతే రసాత్మకతయా త్వాం వ్యంగ్యమర్యాదయా ॥

హే దేవదేవత్తమ! (మే) దేవతాసార్వభౌమ!(మి)! కమనీయ కల్యాణ గుణాలంకార(రే)! కామకోటి సౌందర్య సౌకుమార్య సౌరస్య జలధే! కావ్యప్రియతమ!(మే) కావ్య సేవామవధారయ!

**ప:** వ్యుత్పత్తిః, ప్రభుసమ్మితాత్, భవతి, యా, శబ్ద ప్రధాన, శ్రుతేః
యా చ, అర్థప్రవణాత్, పురాణ వచనాత్, ఇష్టా, సుహృత్ సమ్మితాత్,
తామ్, ఏషా, సుకుమార కోమల ధియః వ్యుత్పాదయంతీ పరా,
కావ్యశ్రీః భజతే, రస+ఆత్మకతయా, త్వాం, వ్యంగ్య మర్యాదయా

**ప్ర:** శబ్ద ప్రధాన = శబ్ద ప్రధానమయిన, శ్రుతేః = వేదము వలన; యా = ఏ కావ్యము; వ్యుత్పత్తిః = శాస్త్రాదిజన్య పరిజ్ఞానము పొందించునో; సుహృత్సమ్మితాత్ = మిత్రుని వంటిదియు, అర్థప్రవణాత్ = అర్థప్రధానమగు; పురాణవచనాత్ = పురాణ వాక్యమువలన; యత్ = ఏది; చిరం = చాలాకాలమునకు, ఇష్టం = ఇష్టమగునో; తామ్ = ఆ; ఏషా = ఇది (పైన చెప్పిన వాటిని కలుపుతూ ఈ కావ్యము); సుకుమార = కోమలమైన; కోమల ధియః = మృదు ఆలోచనలను; వ్యుత్పాదయంతీ = వ్యుత్పత్తిని కలిగించుచూ; రస = 1. శృంగారము, 2. హాస్యము, 3. కరుణము, 4. రౌద్రము, 5. వీరము, 6. భయానకము, 7. బీభత్సము, 8. అద్భుతము, (ఇవి నాట్యరసములు) (భరతనాట్యశాస్త్రము) నవ రసములు అష్టరసములు (8) 9. శాంతము; ఆత్మకతయా = కలిగి ఉండెడి (సరసత్వమును కలిగి); పరా = శ్రేష్ఠమయిన; కావ్యశ్రీః= కావ్యమనెడి లక్ష్మి; త్వాం = నిన్ను; వ్యంగ్య మర్యాదయా = వ్యంజనచేత (ధ్వని) తెలియదగిన అర్థము మర్యాదతో; భజతే = సేవించుచున్నది. (భజ్ సేవాయామ్ ఆత్మనేపది-లట్-ప్ర.పు.ఏ.వ.)

**తా:** శబ్ద ప్రధానమయిన వేదము వలన ఏ కావ్యము శాస్త్రాదిజన్య పరిజ్ఞానము పొందించునో; మిత్రునివంటిదియు, అర్థప్రధానమగు పురాణవాక్యములవలన ఏది చాలాకాలమునకు ఇష్టమగునో - వాటన్నింటిని తనను చదవటం వలన కలిగిస్తూ కోమలమైన ఆలోచనలను పుట్టిస్తూ సరసత్వమును కలిగి శ్రేష్ఠమయిన కావ్యమనెడి లక్ష్మి నిన్ను ధ్వనితో తెలియదగిన అర్థపు మర్యాదతో సేవించుచున్నది.

దేవతలకు దేవతలయిన వారిలో ఉత్తముడా! దేవతలకు సార్వభౌముడా! అందమైన శుభగుణముల అలంకారము కలవాడా! మోక్ష పర్యంతము సర్వ కామములను నెరవేర్చు (కామకోటి) సౌందర్యము, సౌకుమార్యము, రుచులకు సముద్రము వంటివాడా! కావ్యమందు ప్రేమ కలిగినవాడా! నేను ఈ శ్లోకంతో చేసిన కావ్యసేవను స్వీకరించు.

**వి:** 1. యద్వేదాత్ :

ప్రభుసమ్మితాదధిగతం శబ్దప్రమాణాచ్చిరం య
చ్చార్థప్రవణాత్పురాణవచనాదిష్టం సుహృత్సమ్మితాత్ ।
కాంతాసమ్మితయా యయా సరసతా మాపాద్యకావ్యశ్రియా
కర్తవ్యే కుతుకీ బుధో విరచిత స్తస్మై నమస్కుర్మహే ॥

రాజువంటిదియు శబ్దప్రధానము నగు వేదమువలన, చాలాకాలమునకు ఏది పొందబడునో, మిత్రునివంటిదియు, అర్థప్రధానమగు పురాణవాక్యములవలన ఏది చాలాకాలమునకు ఇష్టమగునో భార్యవంటి ఏ కావ్యశ్రీచేత, సరసత్వమును పొందించి కర్తవ్యమునందు ఏది చేయదగినదో అట్టిదానియందు బుధుడు కౌతుకము కలవాడుగా చేయబడెనో అట్టి కావ్యశ్రీకొరకు వేడుకపడుచున్నాము) అను ప్రతాపరుద్రీయ శ్లోకానికి ఈ శ్లోకం చాలా సన్నిహితంగా ఉన్నది.

2. రామ కోటి – కామ కోటి :

శ్రీ చంద్రశేఖరేంద్ర స్వామివారు (నడిచేదేవుడు) "రామకోటి", "కామ కోటి" పదముల మీమాంస చేస్తూ, లోగడ జరిగిన ఒక ఉదంతాన్ని క్రింది విధంగా వివరించారు. "దాదాపు 30 సంవత్సరముల క్రిందట మేము కాశీయాత్ర సల్పిన సందర్భంలో టాటానగర్‌లో కొన్నాళ్ళు మకాం చేశాం, అప్పుడక్కడ ధనుర్మాస సభలు జరుగుతున్నాయి. బీహార్ పత్రికలు మేము అక్కడ ఉన్న విషయం కోసం ప్రకటిస్తూ, "కంచి కామకోటి పీఠాధిపతులు" అనడానికి మారు "రాంచిరామకోటి పీఠాధిపతులు" అన్నాయి! ఇంగ్లీష్ భాషలో 'క్' అనే అక్షరానికి, 'ఆర్' అనే అక్షరానికీ రూపసామ్యం ఉండటం వల్లనూ "కంచి కామ కోటి' అర్థం తెలియనందువల్లను వారు ఆ విధంగా ప్రచురించి ఉంటారు, కానీ ఇది చాలా చమత్కారంగా ఉంది. రాముడు విష్ణువు, కాముడు విష్ణుని పుత్రుడు, కానీ రాముడున్న చోట కాముడు ఉండడు, తొలగిపోతాడు. తులసీదాసుకూడా "రామచరితమానస్"లో "జహారామ్ హో వహాఀ కామ్ నహీ" అన్నారు.

3. అయితే "రాముడు కాముడు" విషయం ఇలా ఉన్నా "రామ కోటి" "కామ కోటి" అనేటప్పటికి – కోటి అనే పదం చేరేసరికి సందర్భమూ, అర్థమూ కూడా మారిపోతుంది. "సోఽశ్నుతే సర్వాన్ కామాన్ సహో" – అన్నట్టు మోక్ష పర్యంతమూ సర్వ కామములనూ నెరవేర్చునది కామకోటి, రాముడున్నచోట కాముడు కనపడదు, గానీ కామకోటి ఉన్నచోట రామకోటి ఉండటానికి అభ్యంతరం లేదు. అందువల్ల కామకోటి మఠం, రామకోటి మఠం కావడం మాకు సంతోషమే! (తెలుగు నాట చంద్రశేఖర వచో విభూతి ఆంధ్రప్రభ తేది: 17.10.1967)

4. ఈ శ్లోకం శార్దూలవిక్రీడితము. 19 అక్షరములు, మ,స,జ,స,త,త,గ గణములు స్వస్తి.

16 ఇతిహాసః

అ: స్త్రీశూద్రద్విజబంధవోఽనధికృతాస్సాంగేషు వేదేషు యే
యేఽల్పజ్ఞాశ్చ విశిష్య తాన్ప్రతిసముద్భూతః పురా బ్రహ్మణః ।

శ్రీమద్వ్యాసపరాశరాదిమునిభిః పశ్చాత్సుసంపాదితః
సోఽ యం భో! ప్రతిపద్యతే ప్రతిపదం త్వాం చేతిహాసో మహాన్ ॥

హే దేవదేవోత్తమ! (మే) దేవతాసార్వభౌమ! (మి) ఇతి కర్తవ్యతా విమూఢ విజయ ప్రతిబోధిత గీతామృత (తే) ఈశాన విష్ణు కమలాసన సమీడితానుభావ! (వే) ఇతిహాస ప్రియతమ! (మే) ఇతిహాస సేవామవధారయ!

**ప:** స్త్రీ, శూద్ర, ద్విజ, బంధవః అనధికృతాః, స+అంగేషు, వేదేషు, యే
యే, అల్పజ్ఞాః చ, విశిష్యతాన్, ప్రతి, సముద్భూతః, పురా(బ్రహ్మణః
శ్రీమత్, వ్యాస పరాశర+ఆది, మునిభిః, పశ్చాత్, సుసంపాదితః
సః, అయం, భో, ప్రతిపద్యతే, ప్రతిపదం, త్వాం చ+ఇతిహాసః, సః, మహాన్

**ప్ర:** పురా = గతించిన కాలములో, స వేదేషు = ఆ వేదములయందు (విదంత్యనేన ధర్మాధర్మావితి వేదః. విదజ్ఞానే. దీనిచేత ధర్మాధర్మములు ఎరుగుదురు); అంగేషు = వేదాంగములయందు (1.శిక్ష, 2.వ్యాకరణము, 3.ఛందస్సు, 4.నిరుక్తము, 5.జ్యోతిషము, 6.కల్పముఅను వేదమునకు అంగములయిన వానియందు); స్త్రీ = స్త్రీలు (స్త్యాయతి సంఘాతో భవత్యస్యాంగర్భ ఇతి స్త్రీ – స్త్యై ష్ట్యై శబ్ద సంఘాతయోః – దేనియందు గర్భము కూర్చబడునో ఆమె స్త్రీ), శూద్రః = శూద్రులు (శోచంతిఖద్యన్త ఇతి శూద్రాః. శుచశోకే. క్లేశపడువారు), ద్విజ = బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులు (ద్విర్జాయంత ఇతి ద్విజాః. జనీ ప్రాదుర్భావే. రెండు సారులు పుట్టువారు), బంధవః = చుట్టములు (బధ్నాతి ప్రీతిమితి బన్ధుః. బన్ధురేవ బాన్ధవః , బంధ బంధనే, ప్రీతిని పొందించువాడు); అనధికృతాః = అనధికృతులు (ఒక విషయాన్ని అర్థం చేసుకోటానికి లేదా సాధించటానికి కావలసిన యోగ్యత అధికృతము. అది రెండు భాగాలు. ఒకటి సామర్థ్యం – మరొకటి అర్థిత్వం (The equipment and inquisitiveness). మొదటిది మానవుడి శరీర నిర్మాణం. రెండవది దాని నాలంబనం చేసుకొని సాధించే ఇచ్ఛ – ప్రయత్నం. రెండూ ఒనగూడినప్పుడే ఫలసిద్ధి. ఇవి రెండూ ఉన్నవాడధికారి. (Competent person) వాడే అధికృతుడు. అధికృతులు కానివారు అనధికృతులు); చ = మరియు; విశిష్య = విశేషించి ; యే = ఏవ; అల్పజ్ఞాః = కొంచెము తెలిసినవారు (ఉన్నారో) తాన్ప్రతి = వారి గురించి; బ్రహ్మణః = భగవత్ ప్రాప్తి యొక్క; సముద్భూతః = బాగా పుట్టిన; శ్రీమత్ = ఒప్పిదములగల; వ్యాస పరాశర+ఆది = వ్యాసుడు, పరాశరుడు మొదలైన; మునిభిః = మునులచేత; పశ్చాత్ = వెనుక; సుసంపాదితః = బాగుగా సంపాదింపబడిన (రచింపబడిన); సః =ఆ; మహాన్ = గొప్పదయిన; ఇతిహాసః = పూర్వచరిత్ర ప్రతిపాదక గ్రంథము. (వ్యు. ఇతిహ+అస+మఞ్. (కృ.ప్ర.) ఇతిహ

(అవ్యయము) = పూర్వమిట్లు జరిగినదని పరంపరగా చెప్పబడినది. ఇట్టిది గల గ్రంథము.); అయం భో! = ఓ భగవంతుడా!; త్వాం = నిన్ను; ప్రతిపదం = ప్రతి పదములోను (పర్యాయపదముగా); ప్రతిపద్యతే = పొందును (పద్ గతౌ లట్ లకారం ప్ర.పు.ఏ.వ. ఆత్మనేపది)

**తా:** ఓ భగవంతుడా! ఆ వేదములయందు, వేదాంగములయందు ఉన్న స్త్రీలు, శూద్రులు, బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులు చుట్టములు, అనధికృతులు మరియూ విశేషించి కొంచెము తెలిసిన వారి గురించి – వారి చరిత్ర ఇతిహాసములుగా భగవదనుభూతి కలిగిన వ్యాసుడు, పరాశరుడు మొదలగు మునులచేత రచింపబడినవి. ఆ ఇతిహాసములు నిన్ను ప్రతి పదములోను సాక్షాత్కరింపచేయుచున్నవి.

దేవతలకు దేవతలయిన వారిలో ఉత్తముడా! దేవతలకు సార్వభౌముడా! ఇది కర్తవ్యము అని తెలియని మోహము పొందిన అర్జునుని గీతామృతముతో మేల్కొల్పినవాడా! శివుడు, విష్ణువు, బ్రహ్మ మొదలగువారిచే పొగడబడిన ప్రభావము కలిగినవాడా! నేను ఈ శ్లోకంతో చేసిన ఇతిహాస సేవను స్వీకరించు.

**వి:** 1. ధర్మార్థ కామ మోక్షాణాముపదేశ సమన్వితం పూర్వావృత్త కథాయుక్త మితిహాసం ప్రచక్ష్యతే.

2. ధర్మార్థకామమోక్షములు అను నాలుగు పురుషార్థములు, ఉపదేశములు, పూర్వవృత్తాంత కథలతో కూడినది ఇతిహాసము.

3. రామాయణ భారతములను ఇతిహాసములుగా చెబుతారు. ఇవి ఛందోబద్ధము లయినప్పటికి కావ్యనాటకాదులవలె కఠినశైలి కలవికావు. ఇవి సాక్షాత్తూ విధిరూపములుగా గాక చరిత్రములను చెబుతూ మనుష్యులకు తెలివి పుట్టించుచున్నవి.

4. వ్యాసుడు : కృష్ణద్వైపాయనుడని మరొకపేరు. తండ్రి పరాశరముని. తల్లి సత్యవతి. వేదములను ఇతడు విభజించి చక్కజేసి ఈపేరును పొందెను. మఱియు ఇతడు భారతమును రచియించినదియెకాక పదునెనిమిది పురాణములను కావించి బ్రహ్మసూత్రము మొదలయిన వేదాంత గ్రంథములను అనేకములను రచియించెను. ఇతని కొడుకు శుకుడు.

5. పరాశరుడు : ఇతడు వసిష్ఠుని పౌత్రుడు. శక్తి పుత్రుడు. వ్యాసుని తండ్రి. వుకుని పితామహుడు. ఇతఁడు తన తండ్రి అగు శక్తిని రాక్షసుడు మ్రింగెనని క్రోధముచే లోకములోని యెల్ల రాక్షసులు నాశము అగునట్లు సత్రయాగము ఒకటి చేసాడు. దానిని చూచి పులస్త్య పులహ క్రతువులు వసిష్ఠుని దగ్గరకు వచ్చి నీ పౌత్రుని సత్రయాగమును ఆపుమని వేడిరి. అంతట వసిష్ఠుని ఉపదేశమున ఇతడు ఆ సత్రమును ఆపాడు.

6. ఒకనాడు పరాశరుడు యమునానదిని దాటిపోవలసి పడవ రేవునకు పోయి పడవ ఎక్కిపోవుచు ఆ పడవను నడుపుచున్న దాశరాజు కూతురు అగు సత్యవతిని చూచి మోహించి ఆమెకు యోజనగంధిత్వమును అనుగ్రహించి చుట్టుపట్టులవారికి తమ క్రీడ కానరాకుండు నటుల ఒక చీకటిని కల్పించి ఆమెను కలసెను. అప్పుడు ఆమెయందు అతనికి సద్యోగర్భమున వ్యాసుడు పుట్టాడు.

7. ఈ శ్లోకం శార్దూలవిక్రీడితము. 19 అక్షరములు. మ,స,జ,స,త,త,గ గణములు. స్వస్తి.

## 17 పురాణం

అ: యత్సర్గాది విశిష్టలక్షణపురాణానీకనిర్మాణత–
స్సంవ్యాస్యచ్ఛృతి తచ్ఛిరాంసి, హి భవాన్(భవతీ)సచ్ఛాస్త్రయోనిస్స్వయమ్।
తద్వై భాగవతాంతముజ్జ్వలమిదం బ్రాహ్మాదికం విస్తృతం
త్వామేవాద్య మహావిభూతిసహితం (తాం) సమ్యగ్ధియా సేవతే ॥

హే దేవదేవోత్తమ! (మే) దేవతాసార్వభౌమ! (మి) పునరావృత్తి రహిత శాశ్వత బ్రహ్మలోకావాప్తి కర! (రి) పురాణ పురుషోత్తమ! (మే) పుణ్యాపుణ్యాతీత(తే)! పురాణ ప్రియతమ! (మే) పురాణ సేవామవధారయ!

**ప:** యత్, సర్గ+ఆది, విశిష్ట లక్షణ పురాణ+అనీక నిర్మాణతః
సంవ్యాసన్, శృతి, తత్, శిరాంసి, హి, భవాన్, సత్+శాస్త్ర యోనిః, స్వయం
తత్, వై, భాగవత+అంతమ్, ఉజ్జ్వలమ్+ఇదం, బ్రాహ్మ+ఆదికం, విస్తృతమ్
త్వామ్, ఏవ, అద్య, మహావిభూతి సహితం సమ్యక్, ధియా, సేవతే

**ప్ర:** యత్ = ఏది; సర్గ+ఆది = 1. సర్గ, 2. ప్రతిసర్గ, 3. వంశం, 4. వంశానుచరితం, 5. మన్వంతరం మొదలయిన; విశిష్ట = విశిష్టమైన; లక్షణ = లక్షణములతో; పురాణ = పురాతన; అనీక = సమూహము; నిర్మాణతః = నిర్మాణము నుండి; సంవ్యాసన్ = **ఉన్నతమైన ఆభరణము** (విడగొట్టబడుచు); శ్రుతి = వేదము; తత్ = ఆ; శిరాంసి = తలలు; హి = కదా!; భవాన్ = నీవు (భగవంతుడవు); స్వయం = స్వయముగా; సత్+శాస్త్ర = చక్కటి శాస్త్రముల; యోనిః = కారణము గని; తత్ = అది; వై భాగవత+అంతమ్ = భాగవతము అంతముగా (భాగవతము చివరి పురాణముగా); ఉజ్జ్వలమ్ = ప్రకాశించుచూ; +ఇదం = ఈ; బ్రాహ్మ+ఆదికం = బ్రహ్మాధిక్యముతో (బ్రాహ్మము, పాద్మము, వైష్ణవము, శైవము, భాగవతము, నారదీయము, మార్కండేయము, ఆగ్నేయము, భవిష్యత్తు, బ్రహ్మవైవర్తము, లైంగము, వారాహము, స్కాందము, వామనము, కూర్మము, మాత్స్యము, గారుడము,

బ్రహ్మాండము అని పదునెనిమిది పురాణములలో బ్రహ్మతో మొదలయిన పురాణముల సంఖ్య ఎక్కువగా ఉన్నందువలన బ్రహ్మాధిక్యమని ఒక అర్థం. బ్రహ్మ సంబంధముగా కలిగిన విస్తృతమ్ = విస్తృతమై; త్వామ్ ఏవ = నిన్నే; అద్య = ఇప్పుడు, మహావిభూతి సహితం = మహైశ్వర్యముతో; సమ్యక్ ధియా = చక్కని బుద్ధితో; సేవతే = సేవించుచున్నది. (సేవ్ సేవనే. ఆత్మనేపది. లట్. ఏ.వ.)

**తా :** ఓ భగవంతుడా! 1.సర్గ, 2.ప్రతిసర్గ, 3.వంశం, 4.వంశానుచరితం, 5.మన్వంతరం మొదలయిన లక్షణములతో, స్వయముగా చక్కటి శాస్త్రముల గనియై, ఈ పురాణము బ్రహ్మాధిక్యముతో (బ్రాహ్మము, పాద్మము, వైష్ణవము, శైవము, భాగవతము, నారదీయము, మార్కండేయము, ఆగ్నేయము, భవిష్యత్తు, బ్రహ్మవైవర్తము, లైంగము, వారాహము, స్కాందము, వామనము, కూర్మము, మాత్స్యము, గారుడము, బ్రహ్మాండము అని పదునెనిమిది పురాణములలో బ్రహ్మతో మొదలయిన పురాణముల సంఖ్య ఎక్కువగా ఉన్నందువలన బ్రహ్మాధిక్యమని ఒక అర్థం. బ్రహ్మ సంబంధముగా కలిగినదని ఇంకొక అర్థం) విస్తృతమై, నిన్ను మహైశ్వర్యముతో, చక్కని బుద్ధితో సేవించుచున్నది.

దేవతలకు దేవతలయిన వారిలో ఉత్తముడా! దేవతలకు సార్వభౌముడా! మళ్ళీ మళ్ళీ పుట్టుట అనునది లేకుండా శాశ్వతమైన బ్రహ్మలోకాన్ని పొందించువాడా! పురాణాలలో వర్ణించిన పురుషోత్తముడా! పుణ్యానికి, పాపానికి అతీతమైనవాడా! పురాణమందు ప్రేమ కలిగినవాడా! నేను ఈ శ్లోకంతో చేసిన పురాణ సేవను స్వీకరించు.

**వి :**1. 'సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశో మన్వంతరాణి చ ।
వంశానుచరితం చైవ పురాణం పంచలక్షణం ॥

2. పురాణం అంటే ప్రాచీనమైన అని ఒక అర్థం. "పురాపినవమ్ పురాణమ్" "పురానీయతే ఇతి పురాణమ్" "పురాభవమితి పురాణమ్" మొదలైనవి ఇతర నిర్వచనాలు.

3. పురాణం పంచలక్షణమని చెప్పినవాడు – అమరసింహుడు. అవి 1. సర్గ, 2. ప్రతిసర్గ, 3. వంశం, 4. వంశానుచరితం, 5. మన్వంతరం.

4. సర్గ అంటే సృష్టిపుట్టుపూర్వోత్తరాలను తెలిపేది.

5. ప్రతిసర్గ అంటే కల్పాంతంలో జరిగే పునఃసృష్టి.

6. వంశం అంటే దేవతలు, రాక్షసుల, ఋషుల వంశ వృత్తాంతాన్ని వివరించేది.

7. వంశానుచరితం అంటే సూర్యచంద్ర వంశాలకు చెందిన రాజుల వృత్తాంతాన్ని తెలిపేది.

8. మన్వంతరం అంటే మనుకాల మధ్య చరిత్ర. పధ్నాలుగు మన్వంతరాలు ఉన్నాయి. అవి. 1. స్వాయంభువ, 2. స్వారోచిష, 3. ఉత్తమ, 4. తామస, 5. రైవత, 6. చాక్షుస, 7. వైవస్వత, 8. సూర్య సావర్ణి, 9. ఇంద్ర సావర్ణి, 10. బ్రహ్మ సావర్ణి, 11. రుద్ర సావర్ణి, 12. రౌచ్యక సావర్ణి, 13. అగ్ని సావర్ణి (పాఠాంతరం ధర్మ సావర్ణి), 14. భౌచ్యక సావర్ణి.

9. పురాణాలు జ్ఞాపకం ఉండడం కోసం ఒక తేలిక సూత్రము పెద్దలు చెప్పారు.

10. 'మ' ద్వయం, 'భ' ద్వయం చైవ 'బ్ర'త్రయం, 'వ'చతుష్టయం ।
'అ''నా''ప''లిం''గ''కూ''స్కా''ని' పురాణాని పృథక్పృథక్ ॥ (దేవీభాగవతం 1-3-21)

11. మద్వయం - మకారంతో రెండు పరాణములు ప్రారంభం అవుతాయి. అందులో ఒకటి మార్కండేయ పురాణము, రెండవది మత్స్య పురాణము.

12. భద్వయం - భ తో రెండు పురాణములు ప్రారంభ మవుతాయి. అవి భాగవత పురాణము, భవిష్య పురాణము

13. బ్ర త్రయం - 'బ్ర'తో మూడు పురాణములు ప్రారంభమవుతాయి. అవి బ్రహ్మ పురాణము, బ్రహ్మాండ పురాణము. బ్రహ్మవైవర్త పురాణము.

14. వచతుష్టయం - 'వ'కారంతో నాలుగు పురాణములు ప్రారంభమవుతాయి. అవి వరాహ పురాణము, విష్ణు పురాణము, వామన పురాణము, వాయు పురాణము

15. అనాపలింగకూస్కాని - అన్నప్పుడు ఒక్కొక్క అక్షరమునకు ఒక్కొక్క పురాణం వస్తుంది.

అ - అగ్నిపురాణం, నా - నారదపురాణం, ప - పద్మ పురాణం, లిం - లింగ పురాణం, గ - గరుడ పురాణం, కూ - కూర్మ పురాణం, స్కా - స్కాంద పురాణం.

16. ఈ శ్లోకం శార్దూలవిక్రీడితం. 19 అక్షరములు. మ,స,జ,స,త,త,గ గణములు.

## 18 సంగీతం

**అ:** ఈ శ్లోకంలో కవి సంగీతము ద్వారా ఆ పరమాత్మకు అక్షరసేవ చేస్తేన్నారు.

యస్య స్ఫూర్తిలవాయ నాగమృగగోబాలాస్తథా యోగిన-
స్సర్వే నాదతనోస్తవైవ హృదయే నిత్యం సముత్కంఠితాః ।
తద్వై తుంబురునారదాదిమునిభిస్సొమ్నస్సముద్భావితం
త్వాం సంగీతమథో భజత్యతితమాం సప్తస్వరశ్రీయుతమ్ ॥

హే దేవదేవోత్తమ! (మే) దేవతాసార్వభౌమ! (మి) స్వరబ్రహ్మ విభూషిత సప్తతంత్రీ

విశారద శారదోపాస్య! (సేయ) సకల గోగోపగోపికాసమ్మోహన సమాదృత స్వరార్ణవ దర్శన(నే)! సంగీత ప్రియతమ! (మే) సంగీత సేవామవధారయ!

**ప:** యస్య, స్ఫూర్తిలవాయ, నాగ, మృగ, గో, బాలాః, తథా, యోగినః
సర్వే, నాద తనోః, తవ+ఏవ, హృదయే, నిత్యం, సముత్కంఠితాః
తత్+వై, తుంబురు, నారద+ఆది, మునిభిః, సామ్నః, సముద్భావితం,
త్వాం, సంగీతమ్, అథో, భజతి, అతితమాం, సప్తస్వరశ్రీయుతమ్.

**ప్ర:** అథో = అటుపిమ్మట; యస్య = ఏ సంగీతశాస్త్రముయొక్క; స్ఫూర్తిలవాయ = లవలేశమైన స్ఫూర్తికొరకు; నాగ = పాములు (నగే పర్వతే చందనతరౌ వా భవాః నాగాః పద్భ్యాం నాంగంతీతి వా నాగాః అగి గతౌ పర్వతమునందు కాని చందన వృక్షమునందుకాని పుట్టినవి); మృగ = జింకలు (మృగ్యతే లుబ్ధకైరితి మృగః. మృగ అన్వేషణే. వేట కాండ్రచే వెదుకబడునది); గో = ఆవులు (గమ్ ' ఌ గతౌ, పోవునది కనుక, పొందబడునది కనుక ఆవునకు గోవు అని పేరు); బాలాః = పిల్లలు; తథా = అదే విధముగా; యోగినః = యోగులు, సర్వే = అందరూ, తవ+ఏవ = నీవే; నాద తనోః = నాద తనుభావం నుండి; హృదయే = హృదయమునందు (నాద తనువైన నీ హృదయమునందు...); నిత్యం = నిత్యము; సముత్కంఠితాః = మిక్కిలి ఉత్కంఠ కలవారు; తత్+వై = ఆ (వై పూరణ వాచకము); తుంబురు = గంధర్వ గురువయిన తుంబురుడు; నారద+ఆది = నారదుడు మొదలయిన; మునిభిః = మునులచేత; సామ్నః = సామవేదమునుండి; సముద్భావితం = పుట్టిన; సంగీతమ్ = సంగీతము; అతితమాం = మిక్కిలిగా; సప్తస్వరశ్రీయుతమ్ = నిషాదము మొదలయిన ఏడు స్వరముల సంపదతో కూడుకొని; త్వాం = నిన్ను; భజతి = సేవించుచున్నది. (భజ్ సేవాయామ్ పరస్మైపది లట్ ఏ.వ. భజతి భజతః భజన్తి)

**తా:** ఓ ఈశ్వరుడా! సంగీతశాస్త్రముయొక్క కొద్దిపాటి స్ఫూర్తికొరకు పాములు, జింకలు, ఆవులు, పిల్లలు అదే విధముగా యోగులు ఆ గంధర్వగురువయిన తుంబురుడు నారదుడు మొదలయిన మునులందరూ నాదతనువయిన నిన్ను సేవించి హృదయమునందు నిత్యము మిక్కిలి ఉత్కంఠ కలవారు అగుచున్నారు. ఆ సామవేదమునుండి పుట్టిన సంగీతము నిషాదము మొదలయిన ఏడు స్వరముల సంపదతో కూడుకొని నిన్ను సేవించుచున్నది.

దేవతలకు దేవతలయిన వారిలో ఉత్తముడా! దేవతకు సార్వభౌముడా! స్వరబ్రహ్మలచే అలంకరింపబడిన ఏడు తంత్రుల వీణను మ్రోగించగల పండితులచే సేవ్యుడా! సకల గోగోపగోపికలను సమ్మోహన పరచగల, వారి ఆదరణకు నోచుకొన్న వేణుగానమందు బాగా కోరిక కలిగినవాడా! సమ్మతాధికారి సమర్చిత స్వరార్ణవ దర్శన(నే)! శాస్త్ర

సమ్మతాధికారులచేత (సన్యాసులు) త్యాగరాజ స్వామికి స్వరార్ణవ గ్రంథ దర్శనము కలవాడా! (కొందరు సన్యాసులు త్యాగరాజ స్వామికి స్వరార్ణవ గ్రంథమును సమర్పించారని ఒక కథ.) సంగీతమందు ప్రేమ కలిగినవాడా! నేను ఈ శ్లోకంతో చేసిన సంగీత సేవను స్వీకరించు.

**వి:** 1. వేనుడనే గంధర్వుడు సప్తతంత్రీ నిఃస్వనముల వీణను మోహనముగ ప్రయోగించాడట.

2. గాయత్రి మంత్రమును సామగానములో నారదుడు మహతీవీణపై పలికించునని చెప్పుదురు. సరిగమపదని అను సప్తస్వరములు గాయత్రి మంత్రములోని వేనని స్వరార్ణవ మను గ్రంథమున చెప్పబడినది.

3. కర, రుచి, దిక్, పక్షంబులు/గిరి, త్రిశత త్రివింశతియను గిరివాస యటుల్/పరగాయత్ర్యక్షరములు/సరిగమ పదని యటంచు సప్త స్వరముల్ అనగా గాయత్రి మంత్రములోని 2,6,10,15,23,7 అక్షరములే సరిగమపదని అను సప్తస్వరాక్షరములై యున్నవి. త్యాగరాజు ఉపాసించినది. ఈ సప్తస్వర సుందరులను? ఈ సప్త స్వరములు "బ్రహ్మాభివ్యంజకములు" (భాగవతము 1-129)

4. ఈ సప్తస్వరములు పరతత్త్వమును గూర్చి తెలుపును. వెన్నెముకకు వీణా దండమని వేరొకనామము కలదు. అదియే నారదుని మహతీవీణ అనవచ్చును. ఈ వీణాదండము లేక వెన్నెముక లేక మహతీవీణయందు వీణను మీట నక్కరలేకయే తమంతతామే సప్తస్వరములు వినిపించుచున్నవి. అందులకే త్యాగరాజు "నాదతనుమనిశం శంకరం" అన్నారు. కావున భాగవతములో శుకాలాపాభిరామంబు అన్నారు. శుకాలాపశబ్దము నాదబ్రహ్మ విద్యను సూచించును. ఇది గాక హంసోపనిషత్తునందు దశవిధ నాదములు చెప్పబడియున్నవి. ఈ నాదానుకరణమునే దేవాలయము నందలి ఢక్క మొదలగు వాద్య ధ్వనులు సూచించును.

5. శ్రీ రమణమహర్షి మంత్ర జపము చేయునప్పుడు మంత్రమూలమైన నాదాను-సంధానము చేయుమని బోధించెను. తారావిద్యలో గణపతి ముని ఉత్తీర్ణుడయ్యెను. తారా విద్య అనగా ప్రణవనాదము ఎడతెగక వినుట, ఉచ్చరించిన కాలమున మాత్రమే అది వినిపించును కదా? నిరంతరము వినుట ఎట్లు? రేచక పూరకములు సోహం భావముతో జరిపిన ఎడతెగక ఓంకార ధ్వని వినిపించును. కుండలినీశక్తి ప్రకోపించును. కాబట్టి "ఆలాప అభిరామ" మనగా నాదబ్రహ్మవిద్య సూచింపబడిన దనవచ్చును. (మహాభాగవత నవనీతము ప్రథమ భాగము గ్రంథకర్త : మామిళ్ళపల్లి నరసింహం)

6. ఈ భావనంతయూ ఈ శ్లోకంలోని “సప్తస్వరశ్రీయుతమ్” పదబంధం సూచించు చున్నది.

7. సప్త-స్వరములు : 1.నిషాదము, 2.ఋషభము, 3.గాంధారము, 4.షడ్జము, 5.మధ్యమము, 6.దైవతము, 7.పంచమము (నిషాదర్షభ గాంధార షడ్జ మధ్యమ దైవతాః పంచమశ్చేత్యమీ సప్తతంత్రీ కంఠోత్థితాః స్వరాః” - అమరకోశము 1-6-1)

8. ఈ శ్లోకం శార్దూలవిక్రీడితం, 19 అక్షరములు. మ,స,జ,స,త,త,గ గణములు. స్వస్తి.

## 19 నాట్యం

**అ:** ఈ శ్లోకంలో కవి నాట్యము ద్వారా ఆ పరమాత్మకు అక్షరసేవ చేస్తున్నారు.

బృందారణ్యచిదంబరాదిషు లసద్రాసాది గోష్ఠీస్స్వయం
బిభ్రత్త్వం నటరాడ్వపుర్హరిహరశ్రీకం యదర్థం సదా ।
పూజ్యైశ్శ్రీభరతాదిభిః ప్రవవృతే శాస్త్రం చ యస్మా ఇదం
నాట్యం త్వాభిరుచేర్జనస్య బహుధాఽప్యేకం తదా సేవతే ॥

హే దేవదేవోత్తమ! (మే) దేవతాసార్వభౌమ! (మి) నటవల్లీలా కైవల్యాసాదిత జగన్నాటక! (కే) నరనారీ సమాశ్రయ లాస్య తాండవ నాట్య కలా ప్రవర్తక! (ర్తికే)నాట్య ప్రియతమ! (మే) నాట్య సేవామవధారయ!

**ప:** బృంద+అరణ్య, చిదంబర+ఆదిషు, లసత్, రాస+ఆది, గోష్ఠీః, స్వయం
బిభ్రత్, త్వం, నటరాట్, వపుః, హరిహర, శ్రీకం, యత్+అర్థం, సదా
పూజ్యైః, శ్రీ భరత, ఆదిభిః, ప్రవవృతే, శాస్త్రం చ, యస్మా, ఇదం
నాట్యం తు, అభిరుచేః, జనస్య, బహుధా, అపి, ఏకం, తదా, సేవతే

**ప్ర :** బృంద+అరణ్య = బృందావనములో, చిదంబర+ఆదిషు = చిదంబరము మొదలైన ప్రదేశాలలో, లసత్ = ప్రకాశమానమైన, రాస+ఆది = గోపికలును - శ్రీకృష్ణుఁడును మండలాకారములో చేసిన రాస నృత్యము మొదలైన; గోష్ఠీః = సల్లాపము; స్వయం = స్వయముగా; బిభ్రత్ = ధరించియుండువాఁడును నైన (మోయుచున్న); త్వం = నువ్వు; నటరాట్ = నాట్యము చేయు శివుఁడు; హరిహర = శివకేశవులు ఏకమైన మూర్తి, వపుః = శరీరము, శ్రీకం = లక్ష్మీదేవితో కూడిన విష్ణువును; యత్+అర్థం = దేనికొరకు; సదా = ఎప్పుడు; పూజ్యైః = పూజ్యులచేత; శ్రీ భరత ఆదిభిః = భరతుడు మొదలయిన వారి చేత; ప్రవవృతే = ప్రవర్తించునది (ప్ర ఉపసర్గ పూర్వక వృతు వర్తనే లిట్ ఆత్మనేపదమ్ వృతు వర్తనే వవృతే వవృతాతే వవృతిరే); శాస్త్రం = 1. ప్రవృత్తిని గానీ, నివృత్తిని గానీ

బోధించే గ్రంథం, 2. హితవును బోధించేది. నియమన గ్రంథము; చ = కూడా; యస్మాత్ = కనుక; ఇదం = ఈ; నాట్యం తు = నాట్యమన్ననో; అభిరుచేః = అధికాసక్తులయొక్క; జనస్య = జనులయొక్క; బహుధా అపి = అనేక విధములుగా ఉన్నప్పటికి; ఏకం = ఒకే విధముగా; తదా = అప్పుడు; సేవతే = సేవించుచున్నది. (సేవ్ సేవనే లట్ ఆత్మనేపదమ్ సేవతే సేవేతే సేవన్తే)

**తా :** ఓ భగవంతుడా! బృందావనములో, చిదంబరము మొదలైన ప్రదేశాలలో ప్రకాశమానమైన రాస నృత్యము మొదలైన సల్లాపములను స్వయముగా రచించువాడివి నువ్వు. శివరూపములో లక్ష్మీదేవితో కూడిన విష్ణురూపములో శివకేశవులు ఏకమైన హరిహర రూపములో పూజ్యులయిన భరతుడు మొదలయిన వారి చేత రచింపబడిన నాట్యశాస్త్రము మొదలైన గ్రంథములకు ఉదాహరణముగా ఉన్నావు. జనులయొక్క అభిరుచులు అనేక విధములుగా ఉన్నప్పటికి నాట్యము ఒకే విధముగా అందరిని ఆనందింపచేస్తూ నిన్ను సేవించుచున్నది.

దేవతలకు దేవతలయిన వారిలో ఉత్తముడా! దేవతలకు సార్వభౌముడా! నటుని వలె లీలలు ప్రదర్శించుచూ నమ్మిన భక్తులకు మోక్షమును అందించు జగన్నాటకము కలవాడా! స్త్రీలు పురుషులు, ఆశ్రయించిన లాస్య తాండవములు కలిగిన నాట్య కళయందు ప్రవర్తించు వాడా! నాట్యమందు ప్రేమ కలిగినవాడా! నేను ఈ శ్లోకంతో చేసిన నాట్యసేవను స్వీకరించు.

**వి:** 1. "నర్తనము" మూడు రకాలు.

2. మొదటిది నృత్తము. ఇందులో పాట, వాద్యములు కలిసి ఉంటాయి. లయ ఉంటుంది. అభినయము ఉండదు. కేవలము అవయవములను ఆడిస్తారు.

3. రెండవది నృత్యము. ఇది భావాశ్రయము పదార్థములను అభినయిస్తారు.

4. మూడవది నాట్యము. ఇందులో సాత్త్విక భావములు ఉంటాయి. రసాలను ఆశ్రయించి ఉంటుంది. వాక్యార్థమును అభినయిస్తారు.

5. లాస్యమని, తాండవమని నృత్య, నృత్తములు రెండు రకాలు.

6. సుకుమారముగా ఉండునది లాస్యము. స్త్రీ పురుషుల పరస్పర సంబంధ భావనలు లాసము. దానికొరకైనది దానికి తగినది లాస్యము. లాస్యాన్ని పార్వతీదేవికి శివు డుపదేశించాడు. కనుక ఎక్కువగా స్త్రీలే లాస్యము చేస్తారు.

7. ఉదధతమైన (పైకి ఎగిరిన, కొట్టబడిన) నృత్యం తాండవము.

8. భట్టతండువు అనువాడు భరతమునికి చెప్పెను కనుక అది "తాండవము" అని

చెబుతున్నారు. గాలిలోకి పైకి ఎగిరి, గాలిలోనే పద్మాసనం వేసి, వెంటనే కాళ్ళను విడదీసి నేలమీద నిలుచోవడమో, కూర్చోవడమో చేయగల "అంతర పద్మాసనం", "ఊరుద్వయ తాడితం", "లవణి" మొదలైన కష్టమయిన భంగిమలు కలది తాండవము.

9 రాస/రాస క్రీడ/ రాసలీల శ్రీకృష్ణుడు గోపికలతో కలసి క్రీడ జరపడం రాసగా, రాసక్రీడగా, రాసలీలగా భాగవతం, విష్ణు, బ్రహ్మ, బ్రహ్మవైవర్త, పద్మాది పురాణాలలో వర్ణనలు కనిపిస్తాయి.

10. పంచభూతాలైన పృథివి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశం ప్రతి జీవికి అందుబాటులో ఉండి, అందరికీ ఎలా అనుభవయోగ్యాలైనాయో శ్రీకృష్ణుడూ అలాగే గోపికలందరికీ లభ్యమైనవాడు. కృష్ణుడు ఒక్కడే, కాని గోపికలు పలువురు. ఐనా, కృష్ణుడు ప్రతి గోపికతోనూ ఉంటాడు. సమస్త జీవ గణంలో శ్రీకృష్ణుడు వ్యాపకుడు. అతడు ఆత్మ స్వరూపుడు కనుక అందరిలోనూ ఉన్నవాడు. ఆత్మ సమస్త ప్రాణిగతమైనట్లు శ్రీకృష్ణుడూ అందరిలోని వాడు.

11. భారతం కృష్ణపాత్రకూ, భాగవతం కృష్ణపాత్రకూ తేడా ఉంది. భాగవతంలో దశమ స్కంధం 29వ అధ్యాయం నుంచి 33వ అధ్యాయం వరకు, అంటే ఐదు అధ్యాయాలు పూర్తిగా రాసక్రీడకు సంబంధించినవే. వీటిని రాస పంచాధ్యాయి అంటారు.

12. పేరుకు శృంగార మైనప్పటికీ విషయ సుఖ నివృత్తి సందేశం ఇందులో ఉన్నదని పెద్దలమాట.

13. పోతన భాగవతం లోనూ మండలాకృతిలో జరిగిన రాసక్రీడ అద్భుత వర్ణనం ఉంది.

14. ఈ శ్లోకంలో ప్రయోగించిన శ్రీకం కు ఇతర కవి ప్రయోగం.

స శ్రీకం చ హరిం పూజ్య రుద్రం వా చోమయా సహ ।
యా శ్రీః సా గిరిజా ప్రోక్తా యో హరిః సత్రిలోచనః ॥3

ఆనాడు లక్ష్మీదేవితో కూడిన విష్ణువునుగాని, ఉమాదేవితో కూడిన రుద్రునిగాని పూజింపవలయును. ఏలయన లక్ష్మియే గిరిజ, హరియే ముక్కంటి అని శాస్త్రములు చెప్పుచున్నవి. (శ్రీ వరాహపురాణమను భగవచ్ఛాస్త్రమున ఏబది ఎనిమిదవ అధ్యాయము).

చిదంబర దేవాలయంలో పలుచోట్ల మనకు భరతనాట్య భంగిమలు ప్రదర్శించే సుందర శిల్పాకృతులు గోచరమవుతాయి. ఇక్కడ ప్రతి ఏటా "నాట్యాంజలి" పేరిట మనోహరమైన ఉత్సవం నిర్వహింపబడుతుంది. దేశంలో ప్రసిద్ధి వహించిన నర్తకులు ఈ ఉత్సవంలో పాల్గొంటారు. శాస్త్ర సంబంధమైన గోష్ఠులు జరుగుతాయి. అందుకే శ్లోకంలో గోష్ఠి పద ప్రయోగం జరిగింది.

15. ఈ శ్లోకం శార్దూలవిక్రీడితం. 19 అక్షరములు. మ,స,జ,స,త,త,గ గణములు. స్వస్తి.

## 20 సువాద్యం

**అ:** ఈ శ్లోకంలో సంగీతోపకరణముల ద్వారా ఆ పరమాత్మకు అక్షరసేవ చేస్తున్నారు.

ప్రహ్లాదస్తాలవాద్యం తరలగతితయా చోద్ధవః కాంస్యవాద్యం
వీణావాద్యం సురర్షిః స్వరకుశలతయా పాండుపుత్రః శ్రుతిం వై ।
దేవాధ్యక్షో మృదంగం తదను వివిధవాద్యాంతరాణ్యన్యదేవా-
స్త్వామానందైకసాంద్రం సుఖయితుమభితో వాదయంతీష్టగోష్ఠ్యామ్ ॥

హే దేవదేవోత్తమ! (మే) దేవతాసార్వభౌమ! (మి) స్వానవద్య విద్యానిరస్త కుహక! (కే) సుకృతదుష్కృతానుగుణఫలప్రదాయక! (యిని) సుఖదుఃఖాతీత స్వరూప (పే)! స్వర్గాపవర్గ సంధాయక(యిని)! సువాద్య ప్రియతమ (మే)! సువాద్య సేవామవధారయ!

**ప:** ప్రహ్లాదః తాల వాద్యం తరలగతితయా చ ఉద్ధవః కాంస్య వాద్యం
వీణావాద్యం సుర+ఋషిః స్వరకుశలతయా పాండుపుత్రః శ్రుతిం వై
దేవ+అధ్యక్షః మృదంగం తదను వివిధ వాద్యాంతరాణి అన్య దేవాః
త్వాం ఆనంద+ఏక సాంద్రం సుఖయితుమ్+అభితః వాదయంతి+ఇష్ట గోష్ఠ్యాం

**ప్ర:** ప్రహ్లాదః = ప్రహ్లాదుడు (హిరణ్యకశిపుని కొడుకు. దైత్యదానవులకు అధిపతి. తల్లి లీలావతి. ఇతడు విష్ణుభక్తుడు.); తాల వాద్యం = తాళమును (పాడునపుడు చేతులతోచఱచెడి చఱపు; తాళము వేయు కంచు వాద్యము) వేస్తున్నాడు. తరలగతితయా చ = ప్రకాశించు పద్ధతిలో; ఉద్ధవః = ఉద్ధవుడు (ఒక యాదవుడు. కృష్ణుని మంత్రి. కృష్ణుని భక్తుడు.); కాంస్య వాద్యం = కంచు వాద్యమును మ్రోగిస్తున్నాడు. సుర+ఋషిః = దేవర్షి నారదుడు; వీణావాద్యం = వీణను మీటుతున్నాడు. స్వరకుశలతయా = స్వరనైపుణ్యముతో; పాండు పుత్రః = అర్జునుడు; శ్రుతిం = శ్రుతులను ఏర్పరుచుతున్నాడు. వై = పాదపూరణ అక్షరం; దేవ+అధ్యక్షః = ఇంద్రుడు; మృదంగం = మృదంగమును ధ్వనింపచేస్తున్నాడు. తదను = అదేవిధంగా; అన్య దేవాః = ఇతర దేవతలు; వివిధ వాద్యాంతరాణి = మిగతా వాయిద్యాలు మ్రోగిస్తూ; ఆనంద+ఏక సాంద్రం = ఆనందం ఒకేచోట ఘనీభవించిన; త్వామ్ = నిన్ను; సుఖయితుమ్ = సుఖింపచేయుటకు; అభితః = అంతటా వ్యాపించునట్లుగా; ఇష్టగోష్ఠ్యాం = మంచిచెడ్డలు చెప్పుకొను సందర్భములో; వాదయంతి = మ్రోగిస్తున్నారు. (వద్ ధాతువు(+ణిచ్) పరస్మైపది లట్ ప్ర.పు.ఏ.వ.)

**తా:** ఓ భగవంతుడా! ప్రహ్లాదుడు తాళమును (పాడునపుడు చేతులతో చఱచెడి చఱపు; తాళమువేయు కంచు వాద్యము) వేస్తున్నాడు. వినసొంపయిన పద్ధతిలో ఉద్ధవుడు కాంస్యమును (కంచు వాద్యము) మ్రోగిస్తున్నాడు. దేవర్షి నారదుడు వీణను మీటుతున్నాడు. స్వరనైపుణ్యముతో అర్జునుడు శ్రుతులను (కంఠస్వరాదులకు సహాయమగు తంత్రి మొ॥ వాని ధ్వని) ఏర్పరుస్తున్నాడు. ఇంద్రుడు మృదంగమును ధ్వనింపచేస్తున్నాడు. అలాగే మిగతా వాయిద్యాలతో ఇతరదేవతలు అంతటా వ్యాపించునట్లుగా మ్రోగిస్తూ మంచిచెడ్డలు చెప్పుకొను ఇష్టగోష్ఠి సందర్భములో ఆనందం ఘనీభవించిన నిన్ను సుఖింపచేస్తున్నారు.

దేవతలకు దేవతలయిన వారిలో ఉత్తముడా! దేవతలకు సార్వభౌముడా! ధ్వనితో చెప్పబడిన విద్యచే తిరస్కరింపబడిన ఇంద్రజాలము కలవాడా! పుణ్యానికి, పాపానికి తగిన ఫలితములను ఇచ్చువాడా! స్వర్గ మోక్షములను కలుపువాడా! సువాద్యమందు ప్రేమ కలిగినవాడా! నేను ఈ శ్లోకంతో చేసిన సువాద్య సేవను స్వీకరించు.

**వి :**1. ప్రహ్లాదస్తాలధారీ తరళగతి తయా చోద్ధవః కాంస్యధారీ
వీణాధారీ సురర్షిః స్వరకుశలతయా రాగకర్తార్జునోభూత్ ।
ఇంద్రోవాద స్మృాదంగం జజను కరాః కీర్తనేతేకుమారా
యాత్రాగ్రే భావవక్తా సరసరచనయా వ్యాసపుత్రో బభూవ ॥ అను శ్లోకం శాస్త్రులవారి ఈ శ్లోకానికి మూలాధారం.

2. ప్రహ్లాదుడు తాళమును ధరించగా, ఉద్ధవుడు కాంస్యమును మ్రోయిస్తుండగా, దేవర్షి నారదుడు వీణను మీటుతుండగా, స్వరనైపుణ్యముతో అర్జునుడు రాగములను ఏర్పర్చగా, ఇంద్రుడు మృదంగమును ధ్వనింపజేస్తుండగా, సనకసనందనాదులు జయజయధ్వనులతో కీర్తిస్తుండగా, అగ్రస్థానములో మంచి రచనలతో భావవక్తగా వ్యాసపుత్రుడు (శుకుడు) ప్రకాశిస్తున్నాడు అని మూల శ్లోకంలో ఉండగా, సనక సనందనాదులు, వ్యాసపుత్రుడు (శుకుడు) శాస్త్రుల వారి రచనలో తప్పుకొన్నారు.

3. వాయిద్యాలు నాలుగు రకాలు : 1.తతము (తంత్రీ వాద్యాలు వీణ మొ॥), 2.అవనద్ధము (మద్దెల మొ॥), 3.సుషిరము (వాయుపూరములైనవి వేణువు మొ॥), 4.ఘనము (కంచు తాళములు మొ॥).

"తతం చైవావనద్ధం చ ఘనం సుషిరమేవ చ ।
చతుర్విధం చ విజ్ఞేయమాతోద్యం లక్షణాన్వితమ్॥ ॥ – భ.నా.శా. 6-27

4. "సొగసుగా మృదంగ తాళము జతగూర్చి నిన్ను సొక్కగ జేయు ధీరుడెవ్వడో" (అందంగా 'మద్దెల' తాళాన్ని జోడించి నిన్ను సంతోషపెట్టగలిగిన నేర్పు కలిగిన

గొప్పవాడెవడో) అని త్యాగరాజ స్వామి మద్దెల వాయిద్యాన్ని కీర్తనలో స్వామి సేవకు వాడుకొన్నారు.

5. స్వర రాగ సుధా రసయుత భక్తి స్వర్గాపవర్గమురా ఓ మనసా! స్వర్గము అనే అమృతం, రాగము అనే అమృత రసంతో కూడిన భక్తి ఐహిక సుఖములను (స్వర్గం) మోక్షమును (అపవర్గం) ఇస్తుందని త్యాగరాజస్వామి చెప్పిన భావాన్ని శాస్త్రుల వారు "స్వర్గాపవర్గ" పద ప్రయోగంతో నిక్షేపించారు.

6. ఇది స్రగ్ధర వృత్తం. ప్రకృతి ఛందమునకు చెందిన 302993వ వృత్తము. 21 అక్షరములు. 33 మాత్రలు. ప్రతిపాదమునందు మ,ర,భ,న,య,య,య గణములు.

### 21 ఆశుకవితా

**అ:** ఈ శ్లోకంలో ఆశుకవిత ద్వారా ఆ పరమాత్మకు అక్షరసేవ చేస్తున్నారు.

యా నామ ప్రతిభైకకారణకలా నానావిధైర్వర్ణనై-
స్సాలంకారగుణై రసోజ్జ్వలసమస్యాపూరణైశ్శోభితా ।
వైచిత్ర్యం పరితోగతా శతసహస్రాష్టావధానాదిభిః
సా చేయం సుకవీశ్వరాశుకవితా త్వాం సర్వదా విందతే ॥

హే దేవదేవోత్తమ! (మే) దేవతాసార్వభౌమ! (మి) ఆ బ్రహ్మ స్తంబ పర్యంత జగదానంద దాయక! (యిని) ఆమోద ప్రమోద భరితాంతరంగ! (గే) ఆశుతోష స్వభావ! (వే) ఆశుకవితా ప్రియతమ! (మే) ఆశుకవితా సేవామవధారయ!

**ప:** యా, నామ, ప్రతిభ+ఏక, కారణ, కలా, నానావిధైః వర్ణనైః
స+అలంకార గుణైః రస+ఉజ్జ్వల సమస్యాపూరణైః శోభితాః
వైచిత్ర్యం పరితః గతా శత సహస్ర, అష్ట+అవధాన+ఆదిభిః
సా చ+ఇయం సుకవి+ఈశ్వర, ఆశు కవితా, త్వాం, సర్వదా, విందతే

**ప్ర :** యా = ఏ (ఆశుకవిత); ప్రతిభ = అప్పటప్పటికి వికసించెడు బుద్ధికి; ఏక = ప్రధానమైన; కారణ = హేతువైన; కలా = కళగా; నామ = ప్రసిద్ధి పొంది ఉన్నదో; నానావిధైః = అనేక విధములైన; వర్ణనైః = వర్ణనలతో; స+అలంకార = కావ్యశోభాహేతువు లయిన ఉపమా యమకాది అలంకారములతో (వ్యు.అలమ్+కృ+మఞ్. కృ.ప్ర.), గుణైః = గుణములతో (1. ఔదార్యము, 2. సమత, 3. కాంతి, 4. అర్థవ్యక్తి, 5. ప్రసన్నత, 6. సమాధి, 7. శ్లేష, 8. ఓజస్సు, 9. మాధుర్యము, 10. సుకుమారత ఇవి కావ్యగుణములు); రస = (1. శృంగారము, 2. హాస్యము, 3. కరుణము, 4. రౌద్రము, 5. వీరము, 6.

భయానకము, 7. బీభత్సము, 8. అద్భుతము, 9. శాంతము అను) తొమ్మిది రసములతో, ఉజ్జ్వల = ప్రకాశించు; సమస్యాపూర్ణైః = సమస్యా పూరణములతో; శోభితాః = శోబిల్లునవై; పరితః = సమస్తము, అంతట; వైచిత్ర్యం = విచిత్రత్వమును; గతా = పొందినదై; శత సహస్ర = పదివేలు; అష్టావధాన = 1. చదరంగము, 2. ఆశు కవిత్వము, 3. లేఖనము, 4. పఠనము, 5. గణితము, 6. సంగీతము, 7. యుక్తి చెప్పుట, 8. సంభాషణము అను ఎనిమిది అంశములను ఏక కాలమున గమనించుచు చేయు అవధానము అష్టావధానము. అట్లు చేయువాడు అష్టావధాని; ఆదిభిః = మొదలయిన వాటితో కలిసిన; ఇయం = ఈ; సుకవీశ్వర = ఉత్తమకవుల; సా ఆశుకవితా చ = ఆ ఆశుకవిత్వము, త్వాం = నిన్ను; సర్వదా = ఎప్పుడు; విందతే = తెలియచేయుచున్నది. (విద్ ౨ లాభే. లట్ ఆత్మనేపది ఏకవచనం విన్దతే విదేతే విదన్తే).

**తా:** ఆశుకవిత అప్పటప్పటికి వికసించెడు బుద్ధికి ప్రధానమైన హేతువైన కళగా ప్రసిద్ధి పొంది ఉన్నది. అనేక విధములైన వర్ణనలతో కావ్యశోభాహేతువులయిన ఉపమా యమకాది అలంకారములతో గుణములతో, తొమ్మిది రసములతో, ప్రకాశించు సమస్యా పూరణములతో ఆశుకవిత శోభిల్లుచున్నది. అంతటా విచిత్ర రామణీయకమును పొంది (వక్రోక్తి) అనేక అష్టావధానములలో ప్రస్తావింపబడి ఉత్తమకవుల ఆశుకవిత్వము నిన్ను ఎప్పుడు తెలియ చేయుచున్నది. (నీ ఉనికిని తెలియచేయుచున్నదని భావం).

దేవతలకు దేవతలయిన వారిలో ఉత్తముడా! దేవతలకు సార్వభౌముడా! బ్రహ్మనుండి బోదెలేని చిన్నచెట్టు వరకు గల సర్వ ప్రపంచమునకు ఆనందము కలిగించువాడా! ఒప్పుదల, సంతోషముతో నిండిన హృదయము కలవాడా! అల్ప సంతోష (శివ) స్వభావము కలవాడా! ఆశుకవిత్వమందు ప్రేమ కలిగినవాడా! నేను ఈ శ్లోకంతో చేసిన ఆశుకవిత్వ సేవను స్వీకరించు.

**వి:** 1. ఆశుకవిత్వము : అప్పటికప్పుడు వేగముగా చెప్పు కవిత్వము. తలచినంత మాత్రమున వేగముగ ధారాళముగ చెప్పు కవిత్వము. (ఇట్టి కవిత చెప్పువారు ఆశుకవులు).

2. చతుర్విధ కవితలలో ఒకటి ఆశుకవిత. 1. ఆశుకవిత, 2. మధుర కవిత, 3. చిత్రకవిత, 4. విస్తర కవిత (వేటూరి ప్రభాకరశాస్త్రి. తెలుగు మెఱుగులు, 130 పు,)

3. అల్లసాని పెద్దన, భట్టుమూర్తి, ధర్మనకవి, మాడభూషి, తిరుపతి వెంకట కవులు ఇంకా అసంఖ్యాకమైన అనేకమంది కవులు ఈ కవితా విధానానికే వన్నెతెచ్చి తెలుగు సాహితీరంగానికి ఎంతో కీర్తి తెచ్చారు.

4. భారతకోకిల "సరోజినీదేవి" పదకొండేళ్ళ ప్రాయంలో 1300 పంక్తుల "సరోవర సుందరి" అనే ఆశుకవిత చెప్పారట.

5. అందఱు నందఱే మఱియు నందఱు నందఱె యందఱందఱె" – అనే సమస్య ఇస్తే శ్రీనాథుడు ఇలా ఆశువుగా పూరించాడట.

కొందఱు భైరవాశ్వములు కొందఱు పార్థుని తేరి టెక్కెముల్
కొందఱు ప్రాక్కిటీశ్వరులు కొందఱు కాలుని యెక్కిరింతలున్
కొందఱు కృష్ణ జన్మమునఁ గూసిన వారలు నీ సదస్సులో
నందఱు నందఱే మఱియు నందఱు నందఱె యందఱందరే.

(కొందరు కుక్కలు, కొందరు కోతులు, కొందరు వరాహాలు, కొందరు దున్నపోతులు, కొందరు గాడిదలు అని నిందాహేళనం.)

6. అయితే ఆశుకవితను తిరస్కరించిన కవులు లేకపోలేదు. "ఆశుకవిత యనిన వడ్డాది సుబ్బారాయుడుగా రసహ్యపడువారు. కబ్బంబల్లుదురుగాని యాశుకవనోగ్రవ్యాఘ్ర–దంష్ట్రాళికే నబ్బబ్బా! గుఱిగాను... అనివీరు బాధపడినారు. ఆశుకవిత నందముగా జెప్ప సమర్థులే యైనను దానియందు వారి కప్రీతి. ఇది కొందఱకు వింతగానుండును. పద్యము చెప్పి నాలుగైదుమాఱులు వెనుకముందు లాలోచించి సానబట్టినగాని వారెన్నడు ప్రకటింపలేదట. (ఆంధ్రరచయితము 130వ పుట)

7. పానుగంటి వారి 'కంఠాభరణం' నాటకంలోని జంటకవులలో ఒకడు 'ఆశుకవిత యొకటి స్వయముగానే శుద్ధ చయము భువిని" అంటాడు. సినిమా పాటను కూడా ఈ శుద్ధచయములో చేర్చుకోవచ్చని అభిప్రాయపడ్డారు శ్రీశ్రీగారు.

8. ఈ శ్లోకం శార్దూలవిక్రీడితము. 19 అక్షరములు మ,స,జ,స,త,త,గ గణములు. స్వస్తి.

22 చూర్ణికా

**అ:** ఈ శ్లోకంలో చూర్ణిక ద్వారా ఆ పరమాత్మకు అక్షరసేవ చేస్తున్నారు.

ఓతప్రోతసమాససంధిమధురా నృత్యత్పదప్రోజ్జ్వలా
సాలంకారగుణా చమత్కృతికరీ విద్వన్మనోరంజనీ ।
వ్యంగ్యార్థాహితచూతవద్రసపరీ పాకా హ్యనేకార్థదా
శ్రీమద్భాగవతాదిగా భజతి భో! త్వాం శోభనా చూర్ణికా ॥

హే దేవదేవోత్తమ! (మే) దేవతాసార్వభౌమ! (మి) చూతాంకురసమాస్వాద కషాయిత

పుంస్కోకిల కంఠమాధురీ మత్త మానస(సే)! చూడామణీకృతచంద్రమశ్చంద్రికా ధౌతకకుబంతరాళ(ళే)! సురాసురమౌళిపరిచుంబితపాద పీఠ(ఠే)! చూర్ణికా ప్రియతమ! (మే) చూర్ణికా సేవామవధారయ!

**ప్ర:** ఓతప్రోత = అడ్డముగాను నిలువుగాను నేయబడిన (అంతటను విస్తరించిన – పడుగుపేకల మాదిరిగా ఒకదానితోనొకటి కలిసిపోయినట్లు); సమాస = సమర్థములగు పదముల యేకీభావమయిన సమాసములతో; సంధి = కూడికగల సంధులతో, మధురా = మధురమైనది; నృత్యత్ = నటించుచున్న; పద = పదములతో; ప్ర+ఉజ్జ్వలా = బాగా ప్రకాశించుచున్నది; స+అలంకారగుణా = అలంకారములు, గుణములతో కలసినది; చమత్కృతికరీ = చమత్కారము కలిగించునది; విద్వద్+మనోరంజనీ = పాండిత్యముతో మనస్సును రంజింపచేయునది; వ్యంగార్థా = వ్యంగ్యార్థములు కలది! (వ్యంగ్యము = ధ్వనిచే సూచింపబడినది, సూచితార్థము); హితచూతవత్ = మేలు కలిగించు మామిడి వలె; రసపరిపాకా = రస పరిపాకము (పక్వత) కలది; హి = కదా!; అనేకార్థదా = అనేకమైన అర్థములు ఇచ్చునది; శ్రీమత్ = సంపద గల; ఒప్పిదము గల; భాగవతాదిగా = భక్తులందు (పురాణములు) నడచునదయిన! (భక్తులచే పలుకబడునదయిన); చూర్ణికా = చూర్ణిక అను రచనావిశేషము; త్వాం = నిన్ను; భజతి = సేవించుచున్నది.

**తా:** ఓ భగవంతుడా! చూర్ణిక అను రచనా విశేషము అంతటను విస్తరించి – పడుగుపేకల మాదిరిగా ఒకదానితోనొకటి కలిసిపోయిన సమాసములతో, సంధులతో మధురమైనది. నటించుచున్న పదములతో బాగా ప్రకాశించుచున్నది. అలంకారములు, గుణములతో కలసినది. చమత్కారము కలిగించునది. పాండిత్యముతో మనస్సును రంజింపచేయునది. వ్యంగ్యార్థములు కలది. మేలు కలిగించు మామిడి వలె రస పరిపాకము (పక్వత) కలది. అనేకమైన అర్థములు ఇచ్చునది. భక్తులచే పలుకబడునది. అటువంటి చూర్ణిక అను రచనా విశేషము నిన్ను సేవించుచున్నది.

దేవతలకు దేవతలయిన వారిలో ఉత్తముడా! దేవతలకు సార్వభౌముడా! మామిడి చిగురులను బాగా ఆస్వాదించుట చేత ఎఱ్రబడిన గండు కోయిల కంఠ మాధుర్యముచే మత్తెక్కిన మనస్సు కలవాడా! అలంకారార్థము తలయందుంచుకొనెడి రత్నములా ఉన్న చంద్రుని యొక్క వెన్నెలల తెల్లదనముతో నిండిన దిక్కులు కలవాడా! దేవతలు, రాక్షసులు నమస్కరించు సమయములో వారి కిరిటములచేత ముద్దిడబడిన పాదపీఠము కలవాడా! నేను ఈ శ్లోకంతో చేసిన చూర్ణికా సేవను స్వీకరించు.

**వి :**1. "యస్మిన్నోతప్రోత మిదం జగత్" అని భాగవతము ఈ ప్రపంచము పడుగుపేకల మాదిరిగా ఒకదానితోనొకటి కలిసిపోయినదని చెప్పింది.

2. పెద్దలు శ్రీ రావి మోహనరావుగారి సూచనపై ఈ రచయిత (తాడేపల్లి పతంజలి) ఆత్మజ్యోతి మాసపత్రికలో భారతుల పేరయ్య శాస్త్రిగారు రచించిన బాలా త్రిపుర సుందరి చూర్ణికకు అర్థ తాత్పర్య విశేషాలు వ్రాసాడు. అందులో పేర్కొన్న చూర్ణికా విశేషాలలో కొన్నింటిని పునరుద్ధరిస్తాను.

3. లక్షణశిరోమణి మతమున వచనరచన అయిదురకాలు, గద్య, బిరుదుగద్య, చూర్ణిక, వచనము, విన్నపము వీటిలో చూర్ణికలను కృష్ణమాచార్యుడు రచియించినట్లుగా చెప్పి తాళ్లపాక అన్నమాచార్యులవారు తమ సంకీర్తన లక్షణములో చూర్ణిక లక్షణాలు ఈ పద్యంలో చెప్పారు.

ధర కృష్ణాచార్యాదిక
పరికల్పితపదము తాళబంధచ్ఛందో
విరహితమై చూర్ణాఖ్యం
బరగును నిర్యుక్తనామభాసితమగుచున్

4. చూర్ణిక చందో విరహితమైనది. నిర్యుక్తము అని ఇంకొక పేరు దీనికి ఉంది అని అన్నమయ్య వివరణ.

5. పొత్తపి వేంకటరమణకవి లక్షణశిరోమణిలో చూర్ణిక లేక వచన ద్వివచన బహువచన సందర్భంబులుగ విభక్త్యానుశాసనిక సమాసాదిత కల్పనానల్పజల్పితంబై వెలయును అన్నాడు. ఏకవచన ద్వివచన బహువచన సందర్భాలతో, మనోహరమైన కల్పనలతో, విభక్తులను అనుశాసించుటకు తగినట్లుగ చూర్ణిక ఉంటుందన్నాడు.

6. ఇక చూర్ణికకు ప్రముఖ నిఘంటువులు ఇచ్చిన అర్థాలు ఇవి.

1.గద్య భేదము, 2.గ్రంథభేదము. (శబ్దరత్నాకరము బహుజనపల్లి సీతారామాచార్యులు 1912) A sort of harmonious prose, not divided into prosodial feet, but with the unbroken sentence running on continuously. (శంకరనారాయణ తెలుగు-ఇంగ్లీష్ నిఘంటువు 1953)

7. 'చూర్ణిక' అంటే తేలిక పదాలతో కూర్చిన రచన అనే అర్థం కొంతమంది చెప్పారు. మల్లాది రామకృష్ణ శాస్త్రి గారయితే చూర్ణిక పదం బాగా నచ్చి ఒక చక్కటి కథ కూడా వ్రాసారు.

8. 'మానాన్న చూశావ్. బయట పరమ సాధువు. ఇంట ఫాలాక్షుడు... ఎవరి మీదా కోపం కాదు. ఎందుకో ఒకందుకని కాదు. ఎప్పుడు ఒకటే ధుమధుమ... అలా అని

పెళ్లాన్ని వేపుక తినేవాడా.. అక్కడ పిల్లి... నా మీద మాత్రం ఒంటికాలి మీద లేచేవాడు...' అంటూ తమాషాగా చమత్కారంగా చూర్ణికలోని ఒక పాత్ర చెబుతుంది.

9. రామదాసు భక్తి పూర్వకంగా రామునిపై 24 కేశవనామాలు కలసి వచ్చేలా ఒక చూర్ణిక రాశారు. ఈ చూర్ణికలో విశేషం ఏమిటంటే ముకుందం, రఘువీర నామాల తర్వాత ప్రతి శ్లోకం చివర కేశవాది 24 విష్ణునామాలు వస్తాయి.

10. ఈ శ్లోకం శార్దూలవిక్రీడితము. 19 అక్షరములు. మ,స,జ,స,త,త,గ గణములు. స్వస్తి.

## 23 పంచాంగం

**అ:** ఈ శ్లోకంలో పంచాంగం ద్వారా కవి ఆ పరమాత్మకు అక్షరసేవ చేస్తున్నారు.

శ్రీకల్యాణకరీ తిథిస్తనుభృతామాయుష్కరో వాసరః
నక్షత్రం ఘనతాపపాపశమనం యోగస్తురోగాపహః ।
వాంఛా సిద్ధివిధాయకం హి కరణం వర్జ్యం శుభం వర్జితం
యస్మాత్త్యాజ్యయుతం భవంతమధునా(విశిష్టమద్య భవతీం)పంచాంగమాసేవతే॥

హే దేవదేవోత్తమ! (మే) దేవతాసార్వభౌమ! (మి) ప్రకృతి భూత వర్షాయన ఋతు మాస పక్ష తిథి వాసర(రే)! పంచ తత్త్వాంచిత ప్రపంచమూల కారణ భూత (తే)! ప్రమాణ ప్రమేయ ప్రమాతృస్వరూప(పే)! పంచాంగ ప్రియతమ! (మే) పంచాంగ సేవామవధారయ!

**ప :** శ్రీ కల్యాణకరీ, తిథిః తనుభృతామ్, ఆయుష్కరః, వాసరః
నక్షత్రం, ఘనతాపపాపశమనం, యోగః, తు, రోగ+అపహః
వాంచాసిద్ధి విధాయకం, హి, కరణం, వర్జ్యం, శుభం, వర్జితమ్
యస్మాత్, త్యాజ్యయుతం, భవంతమ్, అధునా(విశిష్టమ్, అద్య భవతీం) పంచాంగమ్, ఆసేవతే.

**ప్ర:** తిథిః = పాడ్యమి, విదియ, తదియ మొదలైన తిథులు (తన్యతే షష్టిఘటికాభిరితి తిథిః . తను విస్తారే అరువది గడియలచే పెంపొందునది); శ్రీ కల్యాణకరీ = శుభకరమైన; తనుభృతామ్ = తనువును కలిగినవి; వాసరః = వారము, దినము (లోకమును నిలుపునది వాసరః); ఆయుష్కరః = ఆయుస్సును వృద్ధి చేయునది. నక్షత్రం = నశింపనిది (న క్షరతీతి నక్షత్రం క్షీ క్షయే); ఘనతాపపాపశమనం = గొప్ప తాపాలను కలిగించే పాపాలను నశింపచేసేది; యోగః తు = యోగమన్ననో (యుజ్యత ఇతి యోగః యుజిర్ యోగే.

అపూర్వ వస్తు ప్రాప్తి కలిగించేది); రోగ+అపహః = రోగములను (వ్యాధులను) పోగొట్టేది; కరణం = కరణమనునది (క్రియతే అనేనేతి కరణం, డుకృఞ్ కరణే); వాంఛా సిద్ధి విధాయకం = కోరికలను నెరవేరుటకు ఉపయోగపడు పద్ధతి; హి = కదా!; వర్జ్యం = వర్జ్యకాలము (విడువదగిన దోషయుక్త కాలము); శుభం = శుభములను; వర్జితమ్ = వర్జింపబడినది; త్యాజ్య యుతం = దోషయుక్తమైనందున విడువదగినకాలముతో కూడినది; యస్మాత్ = (ఎందువలన) కాబట్టి; పంచాంగమ్ = తిథి – వార – నక్షత్ర – యోగ – కరణములను తెలుపు గ్రంథమయిన పంచాంగము, అధునా = ఇప్పుడు; భవంతమ్ = నిన్ను; ఆసేవతే = సేవించుచున్నది. (ఆఙ్ పూర్వక సేవ్ సేవనే. ఆత్మనేపది – లట్ ఏ.వ.)

**తా :** ఓ భగవంతుడా! (భగవంతురాలా!) తిథి – వార – నక్షత్ర – యోగ – కరణములను తెలుపు పంచాంగములోని పాడ్యమి, విదియ, తదియ మొదలైన తిథులు శుభకరమైనవి. వారము ఆయుస్సును వృద్ధి చేయునది.

నక్షత్రము గొప్ప తాపాలను కలిగించే పాపాలను నశింపచేసేది.

యోగమన్నదో రోగములను (వ్యాధులను) పోగొట్టేది. కరణమనునది కోరికలను నెరవేరుటకు ఉపయోగపడుపద్ధతి. వర్జ్యము శుభములకు వర్జింపదగినది. దోషయుక్తమైనది. ఈ విధమయిన విశిష్ట లక్షణములు కల పంచాంగము ఇప్పుడు నిన్ను సేవించు చున్నది.

దేవతలకు దేవతలయిన వారిలో ఉత్తముడా! దేవతలకు సార్వభౌముడా! ప్రకృతిచే పొందబడిన సంవత్సరములు – అయనములు (1.దక్షిణాయనము కర్కటక సంక్రాంతి మొదలు ఆఱునెలలు, 2. ఉత్తరాయణము మకర సంక్రాంతి మొదలు ఆఱునెలలు). వసంతము మొదలయిన ఋతువులు (అవి ఆఱు – వసంతము, గ్రీష్మము, వర్షము, శరత్తు, హేమంతము, శిశిరము). నెలలు, పక్షములు, తిథులు వారములు కలవాడా! పంచ తత్వములతో కూడిన (1. పృథివి, 2. జలము, 3. తేజస్సు, 4. వాయువు, 5. ఆకాశము) ప్రపంచమునకు మూలకారణమైనవాడా! ప్రమాత, ప్రమేయ, ప్రమాణ స్వరూపుడా! పంచాంగమందు ప్రేమ కలిగినవాడా! నేను ఈ శ్లోకంతో చేసిన పంచాంగ సేవను స్వీకరించు.

**వి:**1. తిథి : పాడ్యమి, విదియ, తదియ మొదలైన తిథులు. పాడ్యమి మొదలు ఐదు తిథులకు నంద, భద్ర, జయ, రిక్త, పూర్ణ అనే పేర్లు (వరుస క్రమంలో) ఉన్నాయి. తరువాత ఐదు తిథులకు తిరిగి ఇవే పేర్లు ఉంటాయి. అలాగే పదకొండవ తిథి నుంచి కూడా ఇవే పేర్లు వస్తాయి. పాడ్యమి, షష్ఠి, ఏకాదశి తిథులు ఆవిధంగా నంద తిథులు,

విదియ, సప్తమి, ద్వాదశి భద్ర తిథులు, ఇదే పద్ధతిలో మిగతా జయ, రిక్త పూర్ణ పేరు కలిగిన తిథులు.

2. పాడ్యమి, విదియ మొదలైన తిథులకు అదే వరుసక్రమంలో అధిపతులైన దేవతలు; 1. అగ్ని, 2. బ్రహ్మ, 3. గౌరి, 4. గణపతి, 5. సర్ప, 6. షణ్ముఖ, 7. సూర్య, 8. రుద్ర, 9. దుర్గ, 10. యమ, 11. విశ్వ, 12. హరి, 13. మన్మథ, 14. శివ, 15. చంద్ర.

3. తిథి ప్రణి అనగా తిథులను నడిపించేవాడు అంటే చంద్రుడు.

4. రోగములు : త్రివిధ–రోగములు : అ) 1. దుష్టాపచారజము (మిథ్యాహారాదులచే కలుగునది), 2. పూర్వాపచారజము (పూర్వజన్మమున చేసిన పాపకృత్యములచే సంభవించునది), 3. ఉభయ సంకరజము (పై జెప్పిన కారణముల రెంటి సంసర్గమున కలుగునది.)

5. " దుష్టాపచారజః కశ్చిత్కశ్చిత్పూర్వాపచారజః ।
తత్సంకరాద్భవత్యన్యో వ్యాధిరేవం త్రిధా స్మృతః ॥" (పరహితసంహిత 4–2)

ఆ) 1. నిజము (వాతాది దోషములచే కలుగునది), 2. ఆగంతుకము (విషము మొదలైన కారణములచే సంభవించునది), 3. మానసము (కామక్రోధాదికము). "తయో రోగా ఇతి, నిజాగంతుమానసాః" (చరకసంహిత 1–11–51)

6. చతుర్విధ రోగములు : 1. స్వాభావికములు, 2. ఆగంతుకములు, 3. కాయికములు, 4. అంతరములు. (శార్ఙ్గధరసంహిత 1–5)

7. యోగములు : ఇవి యిరువది యేడు – విష్కంభము, ప్రీతి, ఆయుష్మత్తు, సౌభాగము, శోభనము, అతిగండము, సుకర్మము, ధృతి, శూలము, గండము, వృద్ధి, ధ్రువము, వ్యాఘాతము, హర్షణము, వజ్రము, సిద్ధి, వ్యతీపాతము, వరీయస్సు, పరిఘు, శివము, సిద్ధము, సాధ్యము, శుభము, శుభ్రము, బ్రహ్మము, ఐంద్రము, వైధ్రుతి.

8. వర్జ్యం : విడువదగినది అని ఈ పదానికి అర్థం. గ్రహాది స్థితులను బట్టి పంచాంగ కర్తలు దినంలో కొన్ని వేళలను దోష సమయాలుగా నిర్ణయించారు. దినాంతర్గమైన ఈ దోషసమయాలే వర్జ్యాలు. ఇవేగాక, సముద్ర యానం, కులాంతర వివాహం, పశువధ, శ్రాద్ధాదులలో మాంస పరిగ్రహణం, వానప్రస్థ సన్యాసం వర్జించవలసినవి అని 19వ శతాబ్ది లోనూ, అంతకు పూర్వమూ అనుకొనే వారు. ఐతే, ఆ కాలంలో సైతం అలాంటి నియమాలు/ సంప్రదాయాలు తప్పు అని వ్యతిరేకించి ప్రతిఘటించిన వారు ఉండేవారు.

9.

10. ప్రమాత, ప్రమేయ, ప్రమాణ స్వరూపుడా!

పూర్ణమదః పూర్ణ మిదమన్నట్టు పూర్ణమైనది ఆత్మచైతన్యం. అది మన స్వరూపమే. కనుక దానిని గుర్తించి అనుభవానికి తెచ్చుకోవటమే జీవిత పరమార్థం. కాని ప్రమాత్రాదుల వ్యవహారమడ్డు తగులుతున్నంతవరకూ అది సాధ్యం కాదు. ప్రమాత్రాదులేమిటి. ప్రమాత, ప్రమేయమూ, ప్రమాణమూ ఇవి మూడే ప్రమాత్రాదులంటే. నాలో గ్రహించే జ్ఞానమేదున్నదో అది ప్రమాత. ఆ జ్ఞానానికేది గోచరిస్తున్నదో అది ప్రమేయం. అది బాహ్యమైన వస్తుజాలమే కావచ్చు. మనసులో కలిగే భావాలే కావచ్చు. రెండూ మనకు ప్రమేయమే. కాగా ఈ రెండింటికి సంబంధాన్ని కలిపేదేదో అది ప్రమాణం. ప్రమాకరణం ప్రమాణం. జ్ఞానసాధనమని అర్థం. త్వక్చక్షుశ్శ్రోత్రాదులన్నీ ఇలాంటివే. వీటి మూలంగా మనకు బాహ్య జగత్తు తాలూకు జ్ఞానం కలుగుతున్నది. పోతే ఇది గాక భావజగత్తును గ్రహించడానికి మరొక ప్రమాణముంది మనకు. అది అంతరింద్రియమైన మనస్సు. ఇందులో మొదటి అయిదింటిని ప్రత్యక్షప్రమాణమనీ రెండవ దానిని అనుమాన ప్రమాణమనీ పేర్కొంటారు. బ్రహ్మశ్రీ యల్లంరాజు శ్రీనివాసరావు)

11. ఈ శ్లోకం శార్దూలవిక్రీడితము. 19 అక్షరములు. మ,స,జ,స,త,త,గ గణములు. స్వస్తి.

## 24 వేదగోష్ఠీ

**అ:** ఈ శ్లోకంలో వేదగోష్ఠి ద్వారా కవి ఆ పరమాత్మకు అక్షరసేవ చేస్తున్నారు.

స్వరవర్ణక్రమసంయుతైర్బహువిధైః స్వప్రాతిశాఖ్యోదితైః
పదపాఠైః ప్రతిసంస్కృతైః క్రమజటా పాఠైర్ఘనాంతైస్తథా ।
వరణీయైర్లలితైః క్రమైరిహ చతుర్వేదాస్సమేతా అమీ
వృణుతే త్వాం పరితశ్చతుర్ముఖముఖాధ్యేతృ ప్రపంచోద్గతాః ॥

హే దేవదేవోత్తమ! (మే) దేవతాసార్వభౌమ! (మి)! వేదవేద్య! దివ్యవేష! భాషాభూషణవిరాజమానాప్రాకృత శరీర(రే)! వేదత్రయీ సముపబృంహణాదృత వేదవ్యాసావతార (రే)! విదిత వేదితవ్య(వ్యే)! వేదగోష్ఠీ ప్రియతమ! (మే) వేదగోష్ఠీ సేవామవధారయ!

**ప :**స్వరవర్ణ క్రమ సంయుతైః, బహువిధైః స్వప్రాతిశాఖ్య+ఉదితైః
పదపాఠైః, ప్రతిసంస్కృతైః, క్రమజటాపాఠైః, ఘనాంతైః, తథా

వరణీయైః, లలితైః, క్రమైః ఇహ, చతుర్వేదాః సమేతాః, అమీ
వృణుతే, త్వాం, పరితః చతుర్ముఖముఖాః, ధ్యేతృప్రపంచ+ఉద్గతాః

**ప్ర :** స్వర = 1.ఉదాత్తము, 2.అనుదాత్తము, 3.స్వరితము అను స్వరములతో, వర్ణ క్రమ సంయుతైః = వర్ణక్రమములతో, బహువిధైః = అనేక విధములతో, స్వప్రాతిశాఖ్య+ఉదితైః = 1.వేద భాష్యం, 2.వేద శాఖలకు ప్రత్యేకంగా ఉన్న వ్యాకరణాలయిన ప్రాతిశాఖ్యములలో చెప్పబడిన, పదపాఠైః = పదపాఠములతో; ప్రతిసంస్కృతైః = సమాన శ్రేష్ఠములైన, క్రమజటాపాఠైః = క్రమ జటాపాఠములతో, ఘనాంతైః = ఘనాంతములతో, తథా = ఆ విధంగానే, వరణీయైః = వరింపదగినవారితో, లలితైః = లలితములైన వాటితో, క్రమైః = క్రమములతో, ఇహ = ఇక్కడ (ఈ ప్రపంచంలో), చతుర్ముఖముఖాః = బ్రహ్మ ముఖముల వంటి ముఖములు కలవారయిన, ధ్యేతృప్రపంచ+ ఉద్గతాః = ధ్యేయ ప్రపంచమును భేదించుకొని వెలి కురికిన వేదవేత్తల (అనగా తమ ధ్యానములోని భగవత్ప్రపంచాన్ని వీడి వేదగోష్ఠి కొరకు గానము చేస్తున్నారని భావం), చతుర్వేదాః సమేతాః = చతుర్వేద సమేతమై, అమీ = ఈ వేదగోష్ఠి, త్వాం = నిన్ను, పరితః = సమస్తము, అంతట, వృణుతే = (వృ వరణే లట్ ఆత్మనేపది ప్ర.పు. ఏకవచనం) వరించుచున్నది.

**తా :** ఓ భగవంతుడా! ఉదాత్తాది స్వరములతో, వర్ణక్రమములతో, పదపాఠములతో, క్రమ జటా పాఠములతో, ఘనాంతములతో, ధ్యేయ ప్రపంచమును భేదించుకొని వెలి కురికిన బ్రహ్మ ముఖముల వంటి ముఖములు కలవారయిన వేదవేత్తలతో చతుర్వేద సమేతమైన ఈ వేదగోష్ఠి నిన్ను వరించుచున్నది.

దేవతలకు దేవతలయిన వారిలో ఉత్తముడా! దేవతలకు సార్వభౌముడా! వేదములచేత తెలియదగినవాడా! దివ్యమైన వేషము కలిగినవాడా! అనేక భాషలు ఆభరణముగా కలిగి ప్రకాశిస్తూ అసాధారణమైన మాయాతీతమైన (పరబ్రహ్మము) శరీరము కలవాడా! ఋక్, యజుస్, సామ వేదాల వృద్ధిని (ఉపబృంహణము) ఆదరముతో స్వీకరించిన వేదవ్యాసుని అవతారము కలిగినవాడా! తెలుసుకోవలసిన అనేక విషయాలలో ముఖ్యముగా తెలియబడిన వాడా! వేదగోష్ఠిలో ప్రేమ కలిగినవాడా! నేను ఈ శ్లోకంతో చేసిన వేదగోష్ఠి సేవను స్వీకరించు.

**వి :** 1. ప్రాతిశాఖ్యము : వేదమంత్రాలలోని ధ్వనులను ఎలా ఉచ్చరించాలో తెలిపే విభాగాన్ని ప్రాతిశాఖ్యము అంటారు. ఋగ్వేద ప్రాతిశాఖ్య, శుక్లయజుర్వేద ప్రాతిశాఖ్య, తైత్తిరీయ ప్రాతిశాఖ్య మొదలగునవి.

2. వేదంలో ఉన్న వాటిని సూక్తులు అంటారు. వేదంలో వాటిని ఋక్కులు అనీ అంటారు. ఈ సూక్తులను కంఠోపాఠం చేయడానికి కొన్ని పద్ధతులున్నాయి. అవి 1.

వాక్య పాఠం లేదా సంహితా పాఠం, 2. పదపాఠం, 3. క్రమ పాఠం, 4. జట పాఠం, 5. ఘన పాఠం. వీటి స్వరూపాలు చూద్దాం. ఇవిగాక మరిన్నిపద్ధతులూ ఉన్నాయట. ఇలా చేయడం మూలంగా అక్షరం కూడా బీరుపోకుండా ఉంటుంది. అక్షరం బీరుపోకుండా అన్న నానుడి దీనినుంచి పుట్టినదే!

3. త్రయంబకం యజామహే సుగంధిం పుష్టివర్ధనం।
ఉర్వారుకమివ బంధనాత్ మృత్యో ముక్షీయ మామృతాత్ ॥

ఇది మహా మృత్యుంజయ మంత్రం. దీనిని వివిధ రకాలుగా పారాయణ చేయడం చూద్దాం.

1. వాక్య లేదా సంహితా పాఠం :- పై సూక్తాన్ని అలాగే సంధులు విడతీయకుండా గానం చేసేది వాక్య లేదా సంహితా పాఠం.

4. త్రయంబకం యజామహే సుగంధిం పుష్టివర్ధనం ఉర్వారుకమివ బంధనాత్ మృత్యో ముక్షీయ మామృతాత్.

2. పదపాఠం :- ఇందులో సూక్తాన్ని పదాలుగా విడతీసి గానం చేయడం. పదాలుగా 1. త్రయంబకం, 2. యజామహే, 3. సుగంధిం, 4. పుష్టి, 5. వర్ధనం, 6. ఉర్వారుకం, 7. ఇవ, 8. బంధనాత్, 9. మృత్యో, 10. ముక్షీయ, 11. మాం, 12. అమృతాత్. పదాలుగా విడతీసి గానం చేయడాన్ని పద పాఠం అంటారు. ఇలా వేదాన్ని అధ్యయనం చేసినవారిని తెనుగునాట స్వాధ్యాయి అనేవారు.

5. 3. క్రమపాఠం :- క్రమ పాఠంలో పై సూక్తిలోని పదాలను క్రమంలో గానం చేయడం. అది ఇలా.

పదాలు. 1-2, 2-3, 3-4, 4-5, 5-6, 6-7, 7-8, 8-9, 9-10, 10-11, 11-12 త్రయంబకం యజామహే, యజామహే సుగంధిం, సుగంధిం పుష్ఠి, పుష్టి వర్ధనం, వర్ధనం ఉర్వారుక, ఉర్వారుక మివ, ఇవ బంధనాత్, బంధనాత్ మృత్యో, మృత్యో ముక్షీయ, ముక్షీయమాం, మాం అమృతాత్. ఇలా వేదాన్ని అధ్యయనం చేసిన వారిని క్రమాంతస్వాధ్యాయి అనేవారు.

6. జటపాఠం : సూక్తంలో పదాలని 1-2, 2-1, 1-2, 2-3, 3-2, 2-3, 3-4, 4-3, 3-4, 4-5, 5-4, 4-5, 5-6, 6-5, 5-6, 6-7, 7-6, 6-7, 7-8, 8-7, 7-8, 8-9, 9-8, 8-9, 9-10, 10-9, 9-10, 10-11, 11-10, 10-11, 11-

12, 12-11, 11-12 ఇలా కూర్చి సుస్వరంగా గానం చేస్తే, అదిలా ఉంటుంది. ఇలా వేదాన్ని అధ్యయనం చేసినవారిని జటాంత స్వాధ్యాయి అంటారు.

త్రయంబకం యజామహే, యజామహే త్రయంబకం, త్రయంబకం యజామహే; యజామహే సుగంధిం, సుగంధిం యజామహే, యజామహే సుగంధిం; సుగంధిం పుష్టి, పుష్టి సుగంధిం, సుగంధిం పుష్టి; పుష్టి వర్ధనం, వర్ధనం పుష్టి, పుష్టి వర్ధనం; వర్ధనం ఉర్వారుక, ఉర్వారుక వర్ధనం, వర్ధనం ఉర్వారుక; ఉర్వారుకమివ, ఇవ ఉర్వారుక, ఉర్వారుక మివ; ఇవ బంధనాత్, బంధనాత్ ఇవ, ఇవ బంధనాత్, బంధనాత్ మృత్యో, మృత్యో బంధనాత్, బంధనాత్ మృత్యో; మృత్యో ముక్షీయ, ముక్షీయ మృత్యో, మృత్యో ముక్షీయ; ముక్షీయ మాం, మాం ముక్షీయ, ముక్షీయ మాం; మాం అమృతాత్, అమృతాత్ మాం, మాం అమృతాత్

7. ఘన పాఠం :- సూక్తంలో పదాలని 1-2, 2-1, 1-2-3, 3-2-1, 1-2-3; 2-3, 3-2, 2-3-4; 4-3-2, 2-3-4; 3-4, 4-3, 3-4-5, 5-4-3, 3-4-5; 4-5, 5-4, 4-5-6, 6-5-4, 4-5-6; 5-6, 6-5, 5-6-7, 7-6-5, 5-6-7, 7-8-9; 8-9, 9-8, 8-9-10, 10-9-8, 8-9-10; 9-10, 10-9, 9-10-11, 11-10-9, 9-10-11, 10-11, 11-10, 10-11-12, 12-11-10, 10-11-12. ఇలా కూర్చి సుస్వరంగా గానం చేస్తే, అదిలా ఉంటుంది. వేదాన్ని ఇలా అధ్యయనం చేసినవారిని ఘనాంత స్వాధ్యాయి లేదా ఘనపాఠీ అంటారు. వీటిని గురుముఖతః నేర్చుకోవలసిందే. అలవాటులో ఇది ఘనాపాఠీ అయింది. ఈ ఘన పాఠంలో కూడా కొన్ని భేదాలున్నాయి. ఇంత కష్టపడి వేదం జిహ్వాగ్రాన ఉంచుకున్నవారు, అదీగాక పరీక్షలో నూటికి నూరు మార్కులూ రావలసిందేగాని కొన్ని తగ్గినా కుదరనిదీ ఈ విద్య. అందుకు వీరిని ఘనపాఠీ అని గౌరవించడం జరుగుతుంది. ఈ ఘనపాఠీ పదానికి కూడా వికృతార్థమే చెప్పేస్తున్నారు. (నడిచే దేవుడు శ్రీశ్రీశ్రీ చంద్రశేఖర సరస్వతి మహాస్వామి వారి ఆంగ్ల గ్రంథం The Vedas లోని https://kastephale.wordpress.com/2015/1122/ వారి బ్లాగులో తెలుగులో పునరుద్ధరించారు. ఈ శాస్త్రుల వారి వేదగోష్ఠి శ్లోక వివరణకు సంబంధించిన పదాల వివరణను అందులో నుంచి ధన్యవాదాలతో స్వీకరించాను.)

8. ధ్యాతృ ధ్యేయ ధ్యాన : ధ్యానించేవాడు ధ్యాత . Meditator అతడు దేన్ని ధ్యానిస్తున్నాడో అది ధ్యేయం. The Target. ఇరువురికి మధ్య నడిచే వ్యవహారం. రెండు కొనలనూ కలిపే వంతెన లాంటిది ధ్యానం.

9. ఇది మత్తేభవిక్రీడితము. ప్రతి పాదమునందు స,భ,ర,న,మ,య,వ(లగ) గణములుండును. స్వస్తి.

## 25 ఉత్తరనీరాజనం

**అ:** ఈ శ్లోకంలో ఉత్తరనీరాజనం ద్వారా కవి ఆ పరమాత్మకు అక్షరసేవ చేస్తున్నారు.

దివ్యైర్గోఘృతపూరపూరితలసత్కర్పూరఖండోజ్జ్వలై-
ర్మాణిక్యాంచితవర్తికాశ్రితమహాదీపైర్విచిత్రప్రభైః ।
అంతర్యామి తయా తమశ్చయహరం(రాం) జ్యోతిర్మయం(యీం)త్వాం పరం(రాం)
సమ్యగ్భాసయతే త్వదీయకృపయా నీరాజనఞ్చోత్తరమ్ ॥

హే దేవదేవోత్తమ! (మే) దేవతాసార్వభౌమ! (మి)! ఉత్తమ జ్ఞాన వృద్ధ సనకసనందనాద్యుపశ్లోక్య మహాత్మ్య! (త్మ్యే) ఉపనిషత్ప్రతిపాద్య స్వరూప(పిణి)! ఉపాత్త దురితక్షయ కారక(రికే)! ఉత్తర నీరాజన ప్రియతమ! (మే) ఉత్తర నీరాజన సేవామవధారయ!

**ప :** దివ్యైః గోఘృతపూరపూరిత లసత్, కర్పూరఖండ+ఉజ్జ్వలైః
మాణిక్య+అంచిత, వర్తిక+ఆశ్రిత, మహాదీపైః, విచిత్రప్రభైః
అంతర్యామితయా, తమః చయహరం (రాం) జ్యోతిః+మయం(యీం) త్వాం పరం(రాం)
సమ్యక్, భాసయతే, త్వదీయ, కృపయా నీరాజనం+చ+ఉత్తరమ్

**ప్ర :** దివ్యైః = మిక్కిలి ఉత్తమములైన, గోఘృత = ఆవునేయిచే (పంచగవ్యములు. 1. ఆవు పంచితము, 2. ఆవుపేడ, 3. ఆవుపాలు, 4. ఆవుపెరుగు, 5. ఆవునేయి. "గోమూత్రం గోమయం క్షీరం దధి సర్పిస్తథైవ చ గవాం పంచ పవిత్రాణి"); పూర = పూర్తిగా, పూరిత = నింపబడిన, లసత్ = ప్రకాశమానమైన, కర్పూర = హారతి కొఱకు ఉపయోగించు తెల్లని సుగంధద్రవ్యము యొక్క (కల్పతే సుఖాయ కర్పూరం, కృపూసామర్థ్యే – సుఖము కలుగచేయుట కొరకు సమర్థమైనది); ఖండ+ఉజ్జ్వలైః = తునుకలచే వెలుగు, మాణిక్య+అచింత = కెంపులతో కూడుకొన్న, వర్తిక+ఆశ్రిత = దీపపు వత్తులను ఆశ్రయించిన (కలుపబడిన చాల సుగంధ ద్రవ్యముల ముద్దలను ఆశ్రయించిన), మహాదీపైః = గొప్పదైన దీపములయొక్క, విచిత్రప్రభైః = విచిత్ర కాంతులతో, అంతర్యామితయా = సృష్టిలో ప్రవేశించి, ఆ సృష్టిని తన వశములో ఉంచుకొని, తన మూలముగా, సర్వమును లీలగా దర్శించు తత్త్వమును అంతర్యామిత్వము అందురు. ఆ అంతర్యామిత్వముతో, పరం(రాం) = శ్రేష్ఠమైన రీతిలో, సమ్యక్ = చక్కనైన రీతిలో, త్వదీయ = నీయొక్క కృపయా = దయతో, తమః చయహరం (రాం) = చీకట్ల సమూహమును హరించు, జ్యోతిః+మయం (యీం) = వెలుగులతో కూడుకొన్న, నీరాజనం+చ+ఉత్తరమ్ = ఉత్తర నీరాజనము (నీరాజనం+చ = నీరాజనఞ్చ+ఉత్తరమ్ = నీరాజ నీరాజనఞ్చోత్తరమ్ (స్తోశ్చునాశ్చుః, ఆద్గుణః

సూత్రములు), త్వాం = నువ్వు (నీచే), భాసయతే = ప్రకాశింపచేయబడుచున్నది; (భాస్ దీప్తౌ – లట్ కర్తరి ప్రయోగం ప్రథమ పురుష ఏకవచనమ్(హేతుమతి చ 3-01-26))

**తా :** ఓ భగవంతుడా! నీరాజోపచార పూజా కల్పము అను రచనను ముగించుచూ నీకు మంగళ నీరాజనము (ఉత్తర నీరాజనము) ఇచ్చుచున్నాను. ఈ ఉత్తర నీరాజనము మిక్కిలి ఉత్తమములైన ఆవునేయిచే పూర్తిగా నింపబడిన ప్రకాశమానమైన కర్పూర తనుకలచే వెలుగుచున్నది.

కెంపులతో కూడుకొన్న దీపపు వత్తులను ఆశ్రయించిన గొప్పదైన దీపములయొక్క విచిత్ర కాంతులతో సృష్టిలో ప్రవేశించి, ఈ ఉత్తర నీరాజనము ఆ సృష్టిని తన వశములో ఉంచుకొని, తన మూలముగా, సర్వమును లీలగా దర్శించు నీ తత్త్వమును దర్శింప చేయుచున్నది.

నీ దయతో చీకట్ల సమూహమును హరించు వెలుగులతో కూడుకొన్నదై ఈ ఉత్తర నీరాజనము నీచే ప్రకాశింపచేయబడుచున్నది.

దేవతలకు దేవతలయిన వారిలో ఉత్తముడా! దేవతలకు సార్వభౌముడా! ఉత్తములైన జ్ఞానవృద్ధులైన (వృద్ధులైన వారికి సైతం ఆధ్యాత్మిక రహస్యాలను అందించగలవారు జ్ఞాన వృద్ధులు) సనక, సనందన, సనత్కుమార, సనత్సుజాతు లనే నలుగురు బ్రహ్మ కుమారులచే పొగడదగిన (ఉపశ్లోక్య) గొప్పతనము కలిగినవాడా! ఉపనిషత్తులందు ప్రతిపాదించబడిన స్వరూపము కలవాడా! పొందబడిన పాపములు నశించుటకు కారకుడా! శ్రేష్ఠమైన హారతియందు ప్రేమ కలిగినవాడా! నేను ఈ శ్లోకంతో చేసిన శ్రేష్ఠమైన హారతి సేవను స్వీకరించు.

**వి :**1. హారతి = నీరాజనం; ఉత్తర = దాటిపోవటం. To pass by. To Transcend. ఉత్తరణమని కూడా దీనికే మరొకపేరు.

2. నీరాజనములు : పంచ-నీరాజనములు. 1. దీపము, 2. పద్మము, 3. వస్త్రము, 4. మామిడిపండు, 5. తమలపాకు

3. స్వదేహోద్భూతాభిర్ఘృణిభి-రణిమాద్యాభి-రభితో
నిషేవ్యే నిత్యే త్వా మహమితి సదా భావయతి యః ।
కిమాశ్చర్యం తస్య త్రినయన-సమృద్ధిం తృణయతో
మహాసంవర్తాగ్ని-ర్విరచయతి నీరాజనవిధిమ్ ॥ (సౌందర్యలహరి 30వ శ్లో.)

(అమ్మా! నిత్యురాలవగు నీ పాదములనుండి ఉద్భవించిన కాంతులతోను, అణిమాది

శక్తులతోను కూడా నిన్ను తానేయని సర్వకాలములయందు ధ్యానము చేయు భక్తుడు త్రినయనుడైన శివుని ఐశ్వర్యమును కూడ లెక్కచేయడు. ఇక వానికి ప్రళయకాలాగ్ని నీరాజనమువలె అగుచున్నదనుటలో ఆశ్చర్యమేమున్నది.)

సౌందర్యలహరిలో మూడు నీరాజనములు చెప్పారు. మొదటిది ముకుంద బ్రహ్మేంద్రుల కిరీట కాంతులచే ఆ అమ్మకు ఎత్తబడిన నీరాజనం. రెండవది అద్వైత దృష్టిలో అంబికతో ఐక్యతను సాధించిన భక్తునకు ప్రళయ జ్వాల కర్పూర హారతి అవడం. అంటే ఈ హారతి మహా ప్రళయంలో కూడా నాశనం కాని పరబ్రహ్మశక్తి అయిన అంబికకు ఈయబడినదన్నమాట. ఇక మూడవ నీరాజనము నూరవ శ్లోకములో ఉంది. ఆ గ్రంథ పథంలో శాస్త్రుల వారు కూడా నీరాజన సేవను చేసారు.

4. సుర బృంద కిరీట మణి వర నీరాజిత పద నీ పదములు దేవతా బృందముల కిరీటములలోని మణులవల్ల వెలుగుతు వారిచే నీరాజనము చేస్తున్నట్టుగా వుంది అని త్యాగరాజస్వామి మనోహరంగా చెప్పారు. (పరమదయాకర కీర్తన)

5. జ్ఞాన వృద్ధులు:

వయోవృద్ధాః తపోవృద్ధాః జ్ఞానవృద్ధాః తథాఽపరే ।
తే సర్వే ధనవృద్ధస్య ద్వారి తిష్ఠంతి కింకరాః ॥

వయోవృద్ధులు, తపోవృద్ధులు, జ్ఞానవృద్ధులు – వీళ్లంతా ధనవృద్ధుని ఇంటి వాకిలి దగ్గర సేవకులై చేతులు కట్టుకుని నిలబడతారని ఒక కవి చమత్కరించాడు.

6. కర్పూరం: కర్పూరమంటే సాధారణంగా హారతికి ఉపయోగించే కర్పూరమే స్ఫురణకు వస్తుంది. తెల్ల కర్పూరం, పచ్చ కర్పూరం అనే రెండు రకాలు ప్రసిద్ధం. కాని, కర్పూరంలో పదిహేను రకాలు (జాతులు) ఉన్నాయి. అవి: 1.ఘన సారం, 2.భీమసేనం, 3.ఈశావాసం, 4.ఉదయ భాస్కరం, 5.కమ్మ కర్పూరం, 6.ఘటికం, 7.తురుదాహం, 8.తుషారం, 9.హిమ రసం, 10.హారతి, 11.శుద్ధం, 12.హిక్కరి, 13.పోతాశ్రయం, 14.పోతాశం, 15.సితాభ్రం. (ఇవన్నీ కపురం, కప్పురం మొదలైన పర్యాయ పదాలుగా కూడా వాడుకలో ఉన్నాయి.)

7. మాణిక్యము: కెంపు. దీనికి సింహళము, కాలపురము, ఆంధ్రము, తుంబురము ఇవి నాలుగు జన్మదేశములు. సింహళము నందు పుట్టిన కెంపు రక్తవర్ణము కలది, దానికి పద్మరాగమని పేరు. అది యుత్తమము. కాలపురమునందు పుట్టినది పసుపుదాళు కలది దానికి కురువిందమని పేరు. అది మధ్యమము. ఆంధ్రమునందు పుట్టినది అశోకపు చిగురుదాళు గలది. దానికి సౌగంధికమని పేరు, అదియు మధ్యమము. తుంబురమున బుట్టినది నీలపుదాళు గలది, దానికి నీలగంధియను పేరు, అది అధమము.)

8. అంతర్యామిత్వము: ఈ అంతర్యామిత్వమును సాధనలో భాగంగా కూడా చెబుతారు.

సాధనలో భౌతికముగాగాని, మనస్సుతోగాని దిక్కులు చూడరాదు. శ్వాసను స్మరించునపుడు నాసికాగ్రమును స్మరించవలెను. అచ్చటనుండి శ్వాసతో లోనికి పోవుట, వచ్చుటలతో ప్రాణాయామమేర్పడును. మనస్సు శ్వాసయందు నిలుచుటలో ప్రత్యాహారము ఏర్పడుతుంది. మనస్సు, శ్వాస ఏక మగుటతో ధారణ మేర్పడును. బాహ్యము, అంతరము అను ప్రజ్ఞలుకరగి కలసి పోవుటతో అంతర్యామిత్వము ఏర్పడును. ఇదియే ధ్యానస్థితి. ఆ స్థితిలో సర్వకార్యములు ఆచరింపబడుటలో సమాధిస్థితి ఏర్పడుతుంది.

9. శబ్దమను జ్యోతి లేకపోతే మూడు ప్రపంచాలు అంధకార బంధురంగా ఉండేవని దండి చెప్పాడు. జ్యోతిర్మయ ప్రయోగం ద్వారా ఆ జ్యోతిర్మయమైన వాఙ్మయమును కూడా ఈ చివరిశ్లోకంలో కవి స్మరించినట్లయినది.

10. ఈ శ్లోకం శార్దూలవిక్రీడితము. 19 అక్షరములు. మ,స,జ,స,త,త,గ గణములు.

(23.07.2018న పెద్దలు శ్రీ రావి మోహనరావుగారి ప్రోత్సాహముతో మొదలుపెట్టిన ఈ వ్యాఖ్యాన రచన స్వామి దయతో నేటికి (25.08.2018) పూర్తయినది. శ్రీ శాస్త్రుల విశ్వనాథ శర్మగారి శ్రీ రాజోపచారపూజాకల్పము యొక్క ప్రతిపదార్థ తాత్పర్య విశేషములను నాకు చేతనయినంతగా వివరించాను. ఇందులో ఒప్పులు స్వామివి. తప్పులు నావి. ఈ రచనలో వాడుకొన్న నిఘంటు కర్తలకు, గ్రంథకర్తలకు హృదయ పూర్వక కృతజ్ఞతలు.)

ఓం స్వస్తి.

– డా. తాడేపల్లి పతంజలి.

